# నెలకు 19 రు. మాత్రం కట్టండి



# సరికొత్త మెరిట్* కుట్టు మిషన్ స్వంతం చేసుకోండి

సింగర్ షోరూం లోకిగాని, అధికృత డీలర్ దుకాణం లోకిగాని అడుగెట్టండి. వాయిదాలపై కొనేందుకు 1400ల పైగా ఉన్న స్కీముల్ని గురించి అడగండి.

మీ అవసరాలకు తగిన మిషనేదో, మీ జేబుకు తగిన స్కీమేదో కనుక్కోండి. ఇక ఏమాత్రం ఆలస్యం లేకుండా మీ మెరిట్ కుట్టు మిషన్ పట్టుకెళ్లండి.

ఆ తర్వాత ప్రతీనెలా మీరు కట్టవల్సిందల్లా నెల వాయిదా మాత్రమే. దీనికి డబ్బెంటూరా, మీ దర్జీకిచ్చే డబ్బులో మిగిలిందే చక్కగా సరిపోతుంది. మీరేమేం కుట్టదల్చుకున్నదీ, ఏమాత్రం డబ్బు మిగల్చబోయేదీ ఆలోచించారంటే—మీ మిషన్ దాదాపు దమ్మిడీ ఖర్చు లేకుండానే వచ్చినట్టు తెలిసిపోతుంది.

శుభస్య శీఘ్రం. పదండి మరి నేడే.

ఇతర వివరాలకోసం ఈ కూపన్ పోస్టు చేయండి.

సింగర్ స్యూయింగ్ మెషిన్ కం.
207 డి.ఎన్. రోడ్, బొంబాయి-400 001.
సింగర్ వారి "స్యూ సెన్సిబుల్" వాయిదాలపై కొనే స్కీముల్ని గురించి మరింతగా తెల్సుకోగోరుతున్నాను.
వివరాలు దయచేసి వెంటనే పంపండి.
పేరు: ____________________
చిరునామా: ____________________
____________________




సింగర్ స్యూయింగ్ మెషీన్ కంపెనీ

## కుట్టడం, డబ్బు మిగలబెట్టడం ప్రపంచానికి నేర్పింది సింగర్

*సింగర్ కంపెనీ ట్రేడ్‌మార్క్

CHAITRA-SM 463 TEL

## ముఖచిత్రం

తేది 5 2 82 ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం నటి దీప్తినావల్ ఎంతో ఆకర్షించింది. మళ్ళీ మళ్ళీ చూడాలనిపించింది.

కొల్ల ధర్మారావు, లక్ష్మణరావు, రామకుమార్ [చాపరా]

*　*　*

నటనలో నావెల్టీ ప్రదర్శించే నూతన నటి, దీప్తినావల్ ముఖచిత్రంగా వెలువడిన ఈ పత్రిక 5.2.82 చూడ ముచ్చటగా ఉంది ఆహ్లాదపరచింది.

పెన్మెత్స సూరిబాబు, జంపన మణివర్మ, పమ్మి భాస్కర సత్యాజీ ఇందుకూరి రాజాజీ [హైదరాబాద్]

## సీరియల్స్

జీవితవనంలో కొత్తగాలిలో సంధ్య పాత్రను చూస్తే జాలేస్తోంది. తార సీరియల్ కూడా రసవత్తరంగా సాగుతోంది. రెండు సీరియల్స్ మీ [మా] పత్రికకే హైలైట్!!

జి హరిత [లాల్‌పర్వాజ]

*　*　*

"జీవితవనంలో కొత్తగాలి" సీరియల్ ఇంట రెస్టింగ్‌గా, తరువాత పత్రికకోసం ఎదురుచూసేలా ఉంటున్నది. రచయిత్రికి ధన్యవాదములు అర్పించ లేకుండా ఉండలేకపోతున్నాను.

కుమారి బి దీప్తి [ప్రసాదంపాడు]

*　*　*

5.2.82 దీప్తినావల్ ముఖచిత్రం చూడ ముచ్చటగా ఉంది. జీవితవనంలో కొత్త గాలి సీరియల్ చాలా ఇంటరెస్టింగ్‌గా ఉంది వచ్చే వారం కోసం ఎదురు చూసేలా చేస్తోంది. తార సీరియల్ చాలా బావుంది.

కె. పద్మాసుబ్రహ్మణ్యం [కొత్తగూడెం]

*　*　*

5.2.82 ఆంధ్రపత్రికలో జీవితవనంలో కొత్త గాలి సీరియల్ బాగుంది మా ఇంటిల్లి పాదికి ఎంతో ఆనందాన్ని కలిగిస్తున్నది. సంధ్య వాళ్ళమ్మలాంటి వాళ్ళు ఉంటారేమో అని ఈ నవల చదివాక నాకు అనిపిస్తోంది. తార సీరియల్ కూడ చాల ఇంటరెస్ట్‌గా ఉంది.

డి. ఆర్. లక్ష్మి [ఇచ్ఛాపురం]

*　*　*

తార మరియు జీవితవనంలో కొత్తగాలి నిజంగా పాఠకుల హృదయాలలో స్వాతి జల్లులై ప్రవాసాంధ్రులమైన మాకు మీ పత్రిక ఎంతో ముందు చేరుతున్నందుకు కృతజ్ఞతలు.

జి. రామచంద్రరావు, కార్యదర్శి, ఆంధ్ర సారస్వత సమితి, ఎయిర్ ఫోర్స్ [కేరాఫ్99 ఏ.పి.ఓ.]




5.2.82 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక నటి దీప్తినావల్ ముఖచిత్రం ఆహ్లాదపరచింది. పెన్ ఫ్రెండ్ పెద్ద కథ ముగింపు సంతృప్తికరంగా ఉంది.

వై. హేమసుందరరావు, హేమబిందు, ప్రియ (డోర్నకల్)

*　*　*

5.2 82 నాటి ఆంధ్ర పత్రిక ముఖచిత్రం నటి దీప్తి నావల్ ఆకర్షణీయంగాను, తెలుగింటి ఆడపడుచులను గుర్తు తెస్తున్నట్లుగా ఉంది పెన్ ఫ్రెండ్ పెద్ద కథ అయిపోవడం మాకు చాలా బాధ అనిపించింది. ఇంకా ఉంటే బాగుండేది అనుకున్నాం ముగింపు బాగా ఉంది. పత్రిక మా ఇంటిల్లిపాదిని ఆకర్షించింది

ఉమామోహన్ పండా (కాశీబుగ్గ)

## ఊమెన్ కార్టూన్

5 2 82 సంచికలో రాజకీయాల గురించి రాజకీయ నాయకుల గురించి లోకంపోకడలో ఉమెన్ గారు చాల చక్కగా చిత్రించి, వివరించి నందులకు మా అభినందనలు

టి. విశ్వనాథరెడ్డి (పెద్దకొత్తూరు)

## పెద్ద కథ

5.2.82 నాటి పత్రిక ముఖ చిత్రం ఎంతో రమణీయంగా ఉంది పెన్ ఫ్రెండ్ కథ ముగింపు మాకెంతో నచ్చింది

పులపర్తి శ్రీరంగి (మొగిల్తూరు)

# మనవి

## ఉత్తరాలు రాసేవారు

* పూర్తిగా తెలుగు లిపిలోనే రాయాలనీ,

* వారి పేరు, పూర్తి చిరునామా కూడా రాయాలనీ,

మనవి చేసుకుంటున్నాము.

— సంపాదకుడు

## కథలు

హిందీ నటి దీప్తినావల్ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా వుంది. ఈ వారం ప్రచురించిన చెరిగిన బొట్టు, దిక్కు, ఈ తరం అమ్మాయి, వికసిత వదనం కథలు చాలా బాగున్నాయి.

పి. వి రామనాథరావు, ఎస్ విజయశ్రీ (మధిర)

*　*　*

5 2 82 నాటి పత్రికలో 'ఈతరం అమ్మాయి వికసిత వదనం' కథలు ఎంతో విజ్ఞానదాయకంగా ఉన్నాయి.

మట్టా పద్మావతి, మట్టా నాగేష్ పర్వతి వరలక్ష్మి (సంపర)

*　*　*

తేది 5 2 82 వారపత్రిక ప్రచురిత మైన ఈతరం అమ్మాయి కథ చాలా బాగుంది.

బి విశ్వనాథం (ధనుపురం)

*　*　*

5.2.82తేది పత్రికలో "ఈ తరం అమ్మాయి" కథ మాకు బాగా నచ్చింది రచయిత్రికి మా ధన్యవాదాలు. ఈ వారం కార్టూనులు కూడ బాగున్నాయి

పి. రమ, కె. లావణ్య, టి సరళ (నెల్లూరు)

*　*　*

5 2.82 నాటి పత్రికలో ప్రచురించిన 'ఈతరం అమ్మాయి' కథ చాలా బాగుంది.

సి సూరిబాబు, (దాచేపల్లి)

*　*　*

5.2.82 సంచికలో 'ఈతరం అమ్మాయి' అనే కథ చాలబాగున్నది.

వై. సీతారావమ్మ (కాకినాడ)

*　*　*

5 2 82 సంచికలో ప్రచురించబడిన 'ఈ తరం అమ్మాయి' అనే కథ చదివిన తరువాత ఈ ఉత్తరం రాయకుండా వుండలేక పోతున్నాను. ఈ కథ మాకు చాల నచ్చింది రచయిత్రి కథ వ్రాసిన విధము కూడ చాల బాగున్నది.

వై. నాగమణి (రాజమండ్రి)

*　*

నటి దీప్తినావల్ ముఖచిత్రంతో వెలువడిన తే. 5.2 82దినాటి మీ (మా) పత్రిక చూడ ముచ్చటగా ఉంది, మంచి ఇతివృత్తము, సమాజానికి అద్దం పట్టే అంశములు గల కథలను ప్రచురించడంలో మీ (మా) పత్రికకు వేరొక పత్రిక సాటిరాదని చెప్పగలము (ను). చెరిగిన బొట్టు, "వికసిత వదనం" కథలు పాఠకుల హృదయాలలో చెరగని ముద్ర వేస్తాయనటంలో సందేహంలేదు. సీరియల్సు మంచి రసవత్తరంగా ఉన్నాయి.

ఎం. వి ఎస్. మూర్తిపట్నాయక్ (వేణమ్మపేట)

*　*　*

5 2 82 సంచికలో దిక్కు కథ చదివాను. చాలా బావుంది. రచయితకు ధన్యవాదాలు.

సుజయశ్రీ (ఆదోని)

**ఆంధ్రసచిత్రవారపత్రిక**


వ్యవస్థాపకులు :

*దేశోద్ధారక కాశీనాథుని*

*నాగేశ్వరరావు పంతులుగారు*

స్థాపితం : 1908

**శివలెంక శంభుప్రసాద్**

సంపాదకుడు

[1938—1972]

శుక్రవారం : 26-2-'82

దుర్మతినామ సం॥ ఫాల్గుణ శు॥ తదియ

***సంపుటము 75 : సంచిక 25***

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 67-60

ఆరు మాసాల చందా రు 33-80

విడిప్రతి వెల రు. 1-25 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**

**గాంధీనగరం, విజయవాడ-520 003**


---

# విషయానుక్రమణిక

ముఖచిత్రం:

నటి రతీదేవి

(ఫొటో : వి సత్యమూర్తి)







# ఫాలాక్షుని డైరి



## దేవత ముందు దిగంబరి నృత్యం !

సేలంకు చెందిన ఏర్కాడు కొండమీదున్న వెళ్ళక్కాడ్డి అనే వో గ్రామంలో కొండజాతి స్త్రీలు ప్రతి సంక్రాంతికీ మారియమ్మ కోవెలలో దిగంబరంగా నృత్యం చేసి, ఆటలూ, పాటలూ సాగించుతారట! ఆవిధంగా చేస్తే ఆ మారియమ్మ వారిని కరుణిస్తుందని వారి నమ్మకట. సంక్రాంతినాడు మధ్యాహ్నం పన్నెండింటినుంచీ మర్నాడు ఉదయం ఆరు గంటల వరకూ యీ ఉత్సవంలో కేవలం స్త్రీలు మాత్రమే పాల్గొంటారట నగ్నంగా. ఆ రోజు పన్నెండుగంటలకు ముందుగానే వూళ్ళోని మగవారంతా వూరొదిలి, వూరుబయట బిచాణా వేసి, తాము వూళ్ళోకి వెళ్ళకుండా, పై వూరివారెవరూ కూడా వూళ్ళోకి రాకుండా కాపలా కాస్తారట. చిన్న పిల్లాడయినా సరే ఉండనివ్వరటా వాడు.

## ఆవేశంలో పితృ హత్య !

తమిళనాడుకు చెందిన పాలకోడు అనే వూరికి దగ్గర్లో ఉన్న పెరియాంపట్టి అనే గ్రామానికి చెందిన నారాయణసెట్టి అనే వో ధాన్యం మిల్లు వోనరు కొడుకు 21ఏళ్ళగుర్నాథం తాను వ్యాపారం చేసుకుంటానని వో అయిదొందలు తండ్రి వద్ద తీసుకుని, ఆనక కిక్కురు మనకుండా వూరుకునేసరికి తండ్రి నిలదీసి అడిగి, డబ్బు నాశనం చేయకురా అప్రాచ్యుడా అని తిట్లతో అష్టోత్తర నామ పూజ చేసేసరికా గుర్నాథానికి కోపంవచ్చి ఆ మిల్లులో చేతికందిన ఇనుపకడ్డీ పెట్టి తండ్రి తల మీద బలంగా వోటిచ్చుకుని పారిపోయాడట నారాయణసెట్టి ఆ దెబ్బకు గిర్రుని తిరిగిపడి చనిపోయాడట.

## డబ్బొద్దు బాబోయ్ !

'డబ్బు డబ్బు' అని డబ్బుకోసం పడి చచ్చే ఈ రోజుల్లో డబ్బొద్దు దేవుడోయ్ అనేవారుకూడా కొందరున్నారట. స్వీడన్‌లో ఒక నావిక వ్యవస్థలో కెప్టెనుగా పని చేస్తున్న టవుగ్‌వాన్ గెర్బర్ అన్న గారు చనిపోతూ పోతూ ఆయనకు రెండు లక్షల యాభైవేల పౌనుల ఆస్తి వదిలేసి పోతే ఆ ఆస్తి చూసి హడలిపోయిన గెర్బర్ సొమ్మంతా సముద్రం మీద బ్రతికేవారి ఛారిటీకి దానం చేసి వో విల్లు రాసి హమ్మయ్య అన్నారట. అదేమంటే ధనికులు పడేబాధలు తాను ఆ డబ్బుతో పడలేనని నిక్కచ్చిగా చెప్పేశారట. డెన్మార్క్‌కు చెందిన కారల్‌పీటర్ సన్ అనే ఆయనకిలాగే అయిదు లక్షల పౌనులు వారసత్వం వచ్చేసరికాయన ఆ సొమ్ము తనకు ఒద్దనీ, తన సమ్మతి తీసుకోకుండా తనకు రాసిన విల్లుకు తాను జవాబుదారి కాననీ కోర్టుకు విన్నవించి, అదేమిటోయ్ చవలాయీ అంటే "ఆ డబ్బుతో వచ్చే చిక్కులు నాకొద్దు బాబూ, నే హాయిగా ఉన్నానిప్పుడు" అన్నాడట. అదేమాదిరిగా ఇటలీకి చెందిన సెలెర్నో నగరంలో అన్నాపిసినో అనే ఆవిడకు లక్ష పౌనులు ఆస్తి వారసత్వం వచ్చి, ఆ విల్లులో ఆమె అమెరికాలో స్థిరపడి, ఆస్తి వ్యవహారాలు చూసుకోవాలంటే ఆ అన్నాపిసినో అసలు తన కాపాడు ఆస్తి వద్దు పొమ్మని, నేనిప్పుడు ఇక్కడ హాయిగా ఎంచక్కా, ఉన్నాను బాబూ అన్నదట— చదువరీ వీరందరూ పిచ్చివారా?

## కాళ్ళనిబట్టి గుణాలు !

ఆడవాళ్ళ మనస్తత్వాన్ని, వారి గుణగణాలను వారి కాళ్ళనుబట్టి చెప్పవచ్చునట సన్నటి, నున్నటి పిక్కలున్న ఆడవారు సొంత ఆలోచనలు, స్థిర సంకల్పమూ కలవారనీ, కొంచెం లావైన పిక్కలున్న వారు మనోనిశ్చలతా, గుండెనిబ్బరమూ కలవారనీ, కాళ్ళు కొంచెం లావు ఉండి పిక్కలు పరిచినట్టు ఉండేవారు జీవితాన్ని సరదాగా తమాషాకు తీసుకునే తత్వం కలవారనీ అమెరికా విజ్ఞానులు అభిప్రాయపడ్డారట— భళా.

## హత్యకి కారణమైన అసభ్య ప్రవర్తన !

సేలంకు చెందిన 20ఏళ్ళ సత్యనారాయణ అనే అతను లక్ష్మి అనే వో అమ్మాయి మగ్గం మీద పని చెయ్యడానికి వెళ్తొంటే దారి కాసి చూసి, ఏదో వో కొంటెమాట అంటూ ఉండేవాడట. మొన్న 20వ తేదీన మధ్యాహ్నం పన్నెండింటికి ఆమె పనికి వెళ్తుండగా కాస్త ఎక్కువగా తాగిన ఆ సత్యనారాయణ గమ్మున ఆమె చెయి పట్టుకుని, మీదికి లాక్కుని, కౌగిలించుకోపోయాడట. ఆమె తప్పించుకుపోయి, తన తండ్రితోనూ, అన్నగార్లతోనూ చెప్తే వాళ్ళొచ్చి అతన్ని నిలదీసి, కత్తితో పొడిచి చంపేశారట.

## జన్మ హక్కు !

ఆరేళ్ళ మొహాలి వటేత్ అనే వో కుర్రాడు యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా చికాగోలోని అప్పీల్స్ కోర్టులో వో కేసు దాఖలా చేశాడట. పుట్టుకవలన తనకు అమెరికా పౌరసత్వం వచ్చినదనీ, భారతీయులైన తన తల్లిదండ్రులను అమెరికా ప్రభుత్వం పౌరసత్వాన్నివ్వనందువలన తాను అమెరికాలో ఉండ వీలులేకపోవడాన్ని అమెరికా ప్రభుత్వం కలుగజేసుకొని తన పౌర ప్రాథమిక హక్కును అంతరాయం కలిగిస్తోందనీ అతను ఆ ఫిర్యాదులో పేర్కొన్నాడట.

నీ భర్తని కత్తితో పొడిచి ఎందుకు చంపావ్!



# అనాథ

కావ్యలక్ష్మి కొల్హాస్కర్



"అమ్మా! నేనివాళ స్కూలుకెళ్ళను"

తొమ్మిదేళ్ళ ప్రశాంతి తన స్కూల్ యూనిఫాం చేతిలో పట్టుకుని తల్లి దగ్గర కొచ్చింది.

భర్తకి భోజనం వడ్డిస్తూ, పిల్లలిద్దరికీ లంచి బాక్సులు సర్దుతున్న వసుమతి కూతురి వంక తీక్షణంగా చూసి కరుకుగా అడిగింది "ఏం రోగమొచ్చింది?"

జారిపోతున్న ధైర్యాన్ని కూడదీసుకుంటూ చెప్పింది ప్రశాంతి "నా యూనిఫాం దూడు ఎంత మాసి పోయిందో! ఇదివేసుకుని వెళ్తే అన్‌టైడీగా వచ్చానని మా సిస్టర్ తిడుతుంది. వేరే జతకూడ బాత్‌రూమ్‌లోనే వుంది. నువ్వు వుతకనే లేదు."

"ఒక్క రోజు కాస్త బద్ధకించేసరికి నన్ను ఇలా సాధిస్తున్నావే, ఆ డ్రెస్ వేసుకుంటే నీ అందానికేం లోటురాదుకాని నోరు మూసుకుని స్కూలుకెళ్ళు"

గొణుక్కుంటూ ప్రశాంతి లోనికెళ్ళి పోగానే రామకృష్ణ వసుమతిని చెడామడా తిట్టేడు "నీకిదేం రోగం; ఆ చిన్నిదానికిలాగానే శాంతికి కూడా మరి రెండు జతలు యూనిఫాం కుట్టిస్తే నీ సొమ్మేం పోయింది? నువ్విలా బద్ధకించినా, వానొచ్చి ఆరకపోయినా ఇంకో రెండు జతల బట్టలుంటే, దానికి పాపం కాన్వెంట్లో తిట్లు, అవమానం తప్పుతాయి కదా? కొనే వాణ్ణి నేను నీవు బాధపడి పోతావెందుకు? వసూ; ప్రశాంతి పెద్దదవు తోంది. ఇకనైనా నువ్వు నీ వెధవ బుద్ధి మానెయ్యి," వసుమతికి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా లేచిపోయి ప్రశాంతి దగ్గరకెళ్ళి అనునయించబోయాడు "చూడమ్మా, శాంతీ; సాయంత్రం నేనొచ్చేటపుడు ఇంకో రెండు డ్రస్సులు తీసుకొస్తాను. ఇవాళ్టికి మా తం పిస్టర్‌తో మా అమ్మకి ఒంట్లో బాగాలేదని చెప్పు"

వెంటనే అంది శాంతి "అలా చెప్తే సిస్టర్ నమ్మదు నాన్నా, చెల్లాయి బట్టలు చూడు; ఎంత తెల్లగా వున్నాయో; అమ్మ వుతికినా, నేనే మురికి చేసేసుకుంటా నని క్లాసు బయట నిలబెడుతుంది," దీని కేం సమాధానంచెప్పాలో రామకృష్ణకి తెలియలేదు.

ఇంతలో రిక్షా వచ్చిందంటూ వసుమతి పిల్చింది ప్రశాంతి, ప్రియాంక స్కూల్ బాగ్స్ తీసుకుని రిక్షా ఎక్కగానే కదిలి పోయింది. మంచులో తడిసిన మల్లె పూవులా వున్న చెల్లెలి డ్రస్సు ముందు తనది మరింత నల్లగా వున్నట్లనిపిస్తే ముడుచుకుని కూర్చుంది ప్రశాంతి. రిక్షా కాన్వెంటు ముందర ఆగగానే దిగిపోయారు. ప్రశాంతికి ఈ బట్టలతో క్లాస్ టీచర్ కళ్ళలో పడాలని లేదు ప్రియాంక పిల్లల సందోహంలో కలిసి పోగానే కాన్వెంటు ఆవరణలో ఒక ప్రక్కగా వున్న చర్చి వేపుకి దారితీసింది.

* * *

వసుమతికి ఇంటర్ చదువుతుండగానే

## అ నా ధ

రామకృష్ణతో పెళ్ళయింది. ఆమెకు సినిమాలు, నవలలంటే విపరీతమైన పిచ్చి వాటిలో హీరోహీరోయిన్లలాగా తామిద్దరూ ప్రతిరోజూ సినిమాలు, పార్కులు, పిక్నిక్కులు అంటూ తిరగాలని సరదా పడింది ముందు చూపులేని కారణంగా పెళ్ళయిన నాలుగు నెలలకి వసుమతి మూడు నెలల గర్భవతి. పెళ్ళయ్యాక ఆమె కోరిక ప్రకారం అన్నెల్లు తిరిగారేమో; పొట్ట పెరుగుతుంటే, వసుమతి రోడ్డు మీద అందరూ తననే చూస్తున్నారనుకునేది సిగ్గుతో ఇల్లువదిలి బయటకి రావటం మానేసింది· రామకృష్ణ ఎంత చెప్పినా వినేది కాదు. కాని రోజస్తమానం ఇంట్లో కూర్చోవటం ఆమెకు ప్రాణ సంకటంగా తయారయింది. పుట్టబోయే బిడ్డ, తన స్వేచ్ఛనూ ఆనందాన్ని దోచుకుంటున్న రాక్షసిలా అనిపించేది. రోజురోజుకి కోపం పెరగసాగింది.

పాప కడుపులో కదలటం మొదలుపెట్టిన తరువాత కోపం తగ్గించుకుని ఇంకోయాంగిల్ నుంచి ఆలోచించటం మొదలు పెట్టింది తనకి అందమైన ఆడపిల్ల పుడితే ఆ పాపను రకరకాలుగా బొమ్మలాగా డ్రెస్ చేయచ్చు. ఎక్కడకెళ్ళినా, అందరూ తన పాపను చూపించి "ఆ పాప ఎంత బాగుందో" అనుకుంటుంటే తనకెంత గర్వం! ఇలా అనుకోగానే వసుమతి పాపకోసం రకరకాల గౌన్లు కుట్టబోయింది వసుమతికి డ్రెస్ మేకింగ్‌లో మంచి అభిరుచి వుంది. దానికితోడు చక్కని ఇమాజినేషన్ కూడా వుంది. పక్కింటి అనసూయ వసుమతిని నివారించింది, పిల్లలు పుట్టక ముందు వాళ్ళ కోసం ఏమీ తయారుచేసి వుంచరాదంటూ. ఆవిడకి నలభైయేళ్ళు దాటుతున్నా సంతానం కలగలేదు. ఇంక కలగరని నిరాశ చేసేసుకుందికూడా! మంచి మనసున్న వ్యక్తి. వసుమతికి నెల తప్పిందని విన్నప్పుడు అందరికన్నా ఎక్కువ సంతోషించిన వ్యక్తి ఆవిడ. ఆవిడ కొంచెం పూర్వకాలం మనిషి. నమ్మకాలు జాస్తి. వసుమతికి ఏవేవో సలహాలిస్తుండేది. అవన్నీ వసుమతి ఈ చెవిన విని ఆ చెవితో వదిలేసేది. ఇప్పుడు అవన్నీ శ్రద్ధగా ఆచరించ సాగింది. పాలలో కుంకుమపువ్వు వేసుకుని తాగేది, పాప పసిమిఛాయలో వుంటుందని. పెరుగు ఎక్కువ వేసుకుంటే జుట్టు నల్లగా ఒత్తుగా వుంటుందంటే

వెంటనే పాలు కొనటం విక్కృన చేసింది. ఇంకా ఏమికావాలో! గ్రహాణంవాడైతే మంచాన్నంటుకుపోయి కదలనేలేదు ఊపిరి తీసుకోడానిక్కూడా భయపడింది.

వసుమతి కలల్లో సగమే నిజమయ్యాయి. ఆడపిల్లే పుట్టింది. కాని అతి సామాన్యంగా వుంది వసుమతి నిరాశకు అంతులేదు అంతవరకు బలవంతంగా పారదోలుతున్న ఉదాసీనత ఒక్కసారిగా ఆమెపై దాడి చేసింది.

రామకృష్ణ పాపకి ప్రశాంతి అని పేరు పెట్టాడు. "ఏది తొడగితే పెరగక పోతుందిలే" అన్నట్టుగా ఫ్రాకులు కుట్టేది. ఒకరోజు రామకృష్ణ పోరగా పోరగా సినిమాకు బయలుదేరారు అది ఏ. సి. థియేటరు సినిమా మొదలయిన అరగంటకు ఎ సి ఆఫ్ చేసేశారు క్రమంగా హాలు వేడెక్క సాగింది. సినిమాలో లీనమైపోయి వున్న పెద్ద వాళ్ళని ఆ వేడి బాధించలేదు కాని అయిదునెల్ల శాంతి గుక్కపట్టి ఏడవ సాగింది.

వసుమతికి శాంతి పీక నులమెయ్యాలన్నంత కోపం వచ్చింది. సినిమా మంచి రసవత్తర ఘట్టంలో వుంది. భార్యా భర్త లిద్దరూ బయట కొచ్చేశారు. ఇంకోసారి ఇందిరా పార్కు కెళ్ళారు అక్కడ శాంతి దొడ్డికెళ్ళింది పేరుకు పార్కేకాని ఒక్క పంపులోంచి నీళ్ళు రావు. పాపని కడగటానికి నానా అవస్థ పడ్డారు అంతా అయ్యే సరికి ఎంతోసరదాపడిన బోటింగు చెయ్యాలనే ఉత్సాహం చచ్చిపోయింది.

అదేం ఖర్మో! పాప ఎప్పుడూ వసుమతి అన్నం తినేటప్పుడే దొడ్డికెళ్ళేది. దాన్ని కడిగివచ్చాక మరింక భోజనం చెయ్యబుద్ధయ్యేది కాదు. ఆకలి మండుతుంటే కూతుర్ని తిట్టుకునేది ఇవన్నీ పసిపాపలకు సర్వ సామాన్యమైనా తన వసుమతి ఓపెన్ మైండ్‌తో ఆలోచించకుండా పాప పై విముఖత పెంచుకుంది. మానసిక పరిణత చెందకుండానే వివాహమయిన తల్లులైతే, అందరూకాకపోయినా కొందరైనా ఇలాంటి ఇబ్బందులకు లోనవుతుంటారేమో!

అనసూయ మాత్రం ప్రశాంతిని బాగా ముద్దు చేసేది ఆవిడదగ్గర బాగా మాలిమైపోయింది ఇదొక్కటే వసుమతికి రిలీఫ్‌గా వుండేది.

ప్రశాంతికి అయిదో ఏడు నడుస్తుండగా వసుమతి కలలన్నింటికీ రూపమిస్తూ మరో పాప పుట్టింది ఆ పాప నిజంగా ఖరీదైన బొమ్మలా వుండేది. ఆ పాపను చూసుకుని వసుమతి హృదయం ఒక్కసారి ఉప్పొంగింది. ఆ పాపకి పేరు తను సెలెక్టు చేసింది ప్రియంక అని "ప్రియా! ప్రియా!" అని అలారు ముద్దుగా పిలుచుకునేది దురద పెడుతున్న చేతులకు పిండా పని కల్పించింది. ఏ షోకేసులో అందమైన గౌను కన్పించినా, వెంటనే ఇంటికొచ్చేసి కొంచెం ఇంచుమించుగా అటువంటి గౌను కుట్టేది.

ప్రశాంతి నెలల పాపప్పుడు తనని ఆగ్రహావేశురాలిని చేసిన తప్పులన్నీ ఇప్పుడు ప్రియంక చేసినా వాటన్నిటినీ ప్రియంక అందం కాన్సిల్ చేసేసేది పిల్లలిద్దరి మధ్యా ఆమె చూపించుతున్న తేడా స్పష్టంగా తెలిసేది రామకృష్ణ మందలించబోతే "కన్నతల్లిని, వీళ్ళ అవసరాలు ఏమిటో నీకు తెలుసా? మీకు తెలుసా" అని గయ్యమని లేచేది. బయటి వాళ్ళకు నోరెత్తి అనే సాహసం ఎక్కడుంటుంది? ప్రశాంతికి కూడా ఊహ తెలుస్తున్నకొద్దీ చెల్లికీ తనకీ మధ్య తేడా వుందని తెలుస్తోంది. కాని అది ఏపాటో అర్థం అయ్యేది కాదు. తల్లిని ఏమనలేని నిస్సహాయత, ఉక్రోషం ప్రియంక మీద కోపంగా రూపాంతరం చెందాయి. ఎవళ్ళూ చూట్టంలేదనుకున్నపుడు ప్రియని గట్టిగా గిల్లేది క్రమక్రమంగా అది తగ్గిపోయింది ఎప్పుడూ తల్లి కసురుతో స్తబ్బుగా, చురుకు లేకుండా మందకొడిగా తయారయింది. అది వసుమతి విముఖతకి యింకా దోహదం చేసింది

* * *

కాన్వెంటు స్కూల్లో చదువుతున్న శాంతి విచారంగా ఆలోచిస్తుంది "అమ్మకి ప్రియంటే ఎందుకంత ఇష్టం? తనంటే ఎందుకంత కోపం? తనయితే ఇంటిపనుల్లో అమ్మకి సహాయం చేస్తుంది కూడా! ప్రియకి కొత్త కొత్తవి రకరకాల బట్టలు మాక్సీలు, ఫ్రాకులు ఏవేవో కుడుతుంది తనకి మాత్రం పెట్టెలో నాలుగే నాలుగు జతలున్నాయి. అవి అమ్మ తన చీరెలు చించి పరికిణీలు, జాకెట్లు కుడితే. ప్రియ కయితే రోజుకో రకంగా అందంగా వుంటుంది. ఒకరోజు నడినెత్తిన పిలక వేసి రిబ్బన్ కడుతుంది మరో రోజు జుట్టు రెండుగా విడదీసి రెండు రిబ్బను బ్యాండ్స్ పెడుతుంది. ఇంకో రోజేమో పక్క పాపిడి తీసి పువ్వులు పువ్వులుగా ఉన్న పిన్ను పెడుతుంది. ఈ రోజయితే మొన్న ఫ్యాన్సీ సెంటర్లో కొన్న హెయిర్ బాండ్ పెట్టింది. అదెంత బాగుందో! అచ్చం ప్రియకే! తనకి రెండు జడలు వేసి కొమ్ముల్లా వంగించి జడల చివర రిబ్బను కట్టేస్తుంది" కసిగా రిబ్బను పీకుతుంది శాంతి "మొన్నటికి మొన్న ప్రియకి తళతళ మెరిసే గజ్జెలు కొంది. ప్రియ నడుస్తుంటే ఆ చప్పుడు ఎంత బాగుందో! తను కూడా ఎంతో ఆశగా కొనిపెట్టమని అడిగింది. అమ్మేమంది? 'నీ కెందుకే? చిన్నది! దానికి



# "శ్రమ యేవ జయతే!"



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)



నిజాయితీ, కఠోర పరిశ్రమ,

స్థిర సంకల్పంద్వారా అధికోత్పత్తి సాధన

## రిపబ్లిక్ దినోత్సవాన

## మన విజ్ఞప్తి





శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

జాతికి శంకారావం వినిపించింది. క్రమశిక్షణకు, కఠోర పరిశ్రమకు పునరంకితమయ్యే తరుణం వచ్చింది. న్యాయసమ్మతమైన సమ సమాజాన్ని ఏర్పాటు చేసేందుకు ఏకైక మార్గాన్ని సూచిస్తూ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ మనల్ని చైతన్యవంతుల్ని చేసే సందేశం ఇచ్చారు.

కఠోర పరిశ్రమ, సత్యాన్వేషణకు దీక్షతో పాటుపడడం ద్వారానే గౌరవం. ప్రగతి, సౌభాగ్యాలను సాధించగలం అన్నదే ఆమె సందేశం. ఉత్పత్తి పెరుగుదల, సంక్షేమ పథకాల విస్తరణద్వారా బలహీనవర్గాల సమగ్రాభివృద్ధి సాధించగలమనే విషయాన్ని ప్రధాని నూతన కార్యక్రమం స్పష్టీకరిస్తున్నది.

మన రాష్ట్రంలో ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్యగారి నాయకత్వంలో షెడ్యూలు కులాలు, తెగలు, వెనుకబడిన తరగతులు, మహిళలు, బాలలు వంటి బలహీన వర్గాల ప్రజలకు మన అభివృద్ధి ఫలితాలు అందజేసే విధంగా వివిధ పథకాలు ముమ్మరంగా అమలు జరుగుతున్నాయి.

★ సాంఘిక సంక్షేమ పథకాలకు బడ్జెట్ కేటాయింపు 1.977-78నుండి నేటివరకు రు.21 57 కోట్ల నుండి రు. 78.12 కోట్లకు (నాలుగురెట్లు) పెరిగింది.

★ 14 లక్షల కుటుంబాలకు ఇళ్ల స్థలాలు సమకూర్చారు. ప్రస్తుత సంవత్సరంలో మరో 1 5 లక్షల కుటుంబాలకు ఇళ్ల స్థలాలు సమకూరుస్తారు

★ షెడ్యూలు కులాలవారికోసం ఒక ప్రత్యేక అనుబంధ ప్రణాళిక అమలు జరుగుతున్నది ఈ అనుబంధ ప్రణాళిక క్రింద ఖర్చు చేసేందుకు 1980 81 లో రు 42.80 కోట్లు, 1981-82లో రు. 50 కోట్లు కేటాయించారు. 1982-83 సంవత్సరంలో రు 89 37 కోట్లు కేటాయించాలని తలపెట్టారు.

★ షెడ్యూలు కులాల ఆర్థిక సహాయ సంస్థ ప్రస్తుత సంవత్సరంలో 1.19 లక్షల మంది దారిద్ర్యరేఖను దాటేందుకు వీలుగా వివిధ పథకాలు చేపట్టింది.

వనితలకు మనవి

కొత్తరకం వంటలు కుప్తంగా రాసి పంపితే త్వరగా పరిశీలించి ప్రచురిస్తుంది —సం.



# అనాధ

ముచ్చటగా వుంటాయి కాని, నువ్వు పెట్టు కుంటే గజ్జెల గుర్రంలా వుంటావు తినడావి క్కూడా ప్రియ ఏమడిగితే అది వెంటనే చేస్తుంది! తనడిగితే మాత్రం "చేసా లేవే" అంటుంది. కిండర్ గార్టెన్ అయినా ప్రియకి స్కూల్ బ్యాగు ఎంత మంచిది కొంది! తను అయిదో తరగతి చదువుతున్నా తనకీ వెధవ బ్యాగు. మూడవ తరగతి నుంచీ ఇదే! చిరిగి పోతోందికూడా! అయినా ఆ కొత్త ది. కొనదు యూనిఫాం ప్రియకి నాలుగు జతలు. తనకి రెండే రెండు. అదీ కాటన్వి ప్రియకి టెరీ కాట్.

ఆలోచనలలో కొట్టుకుపోతూ చర్చి బెంచీపై నిద్రపోయింది మధ్యాహ్నం బెల్లుకి లేచింది. లంచ్ బాక్సులో అన్నం తినకుండానే మధ్యాహ్నం క్లాసులోకి వెళ్ళింది

ఇంటిదగ్గర వసుమతి శాంతి పసిమనసును గాయపరచి నప్పుడలా శాంతి కాన్వెంటుకి వచ్చి క్లాసుకి వెళ్ళకుండా చర్చిలో కూర్చుం టోంది ఆ చర్చిలో మేరీమాత పాలరాతి విగ్రహముంది. ఆ విగ్రహం చెక్కిన శిల్పి నైపుణ్యం అద్భుతం. ఆ విగ్రహం లోని జీవకళ అనితర సాధ్యం. అందమైన మేరీ మాత ముఖం కొద్దిగా వంచి ఒడిలోని బాల క్రీస్తును చూచుకుంటూంటే పరవశత్వం, పొంగి పొరలే మమకారం శాంతిని ఎంతగానో ఆకర్షించాయి. ఆ విగ్రహాన్ని చూస్తూంటే, ఒక్కసారి ఆ తల్లి ఒడిలో తనూ తల ఉంచుతూనో గంటలు గంటలు గడపాలనిపిం చేది శాంతికి శాంతిని చర్చిలో రెండుమూడు సార్లు "సిస్టర్ సుపీరియర్" చూసింది. ఆమె ఆ కాన్వెంటు కంతకీ అధికారిణి. క్రైస్తవ మతబోధలను మనోవాక్కాయ కర్మలా సాధ్యమయినంత వరకూ ఆచరించా లనుకునే కరుణా మూర్తి. ఆమె శాంతి ముఖంలో తాండవించే దీనత్వం చూసి కరిగి పలకరించాలని దగ్గరకెళ్ళేసరికి శాంతి బెదిరి పారిపోయేది. సిస్టర్ వెనుకనుంచి పిలుస్తున్నా విన్పించుకునేది కాదు.

* * *

ఆ రోజు రామకృష్ణ ఆఫీసు నుంచి త్వరగా వచ్చేశాడు. వస్తూనే వసుమతిని పిల్లల్ని తయారవమని, టైమెక్కువ లేదని తొందరపెట్ట సాగాడు. రామకృష్ణ స్నేహితు

## "కరువు"

ఈ కిరసనాయిల్కు
ఎందుకు రాదు కరువు?
ఈ దేశంలో దొరికే
కిరసనాయిలంతా ...
బాధలను భరించలేని
ఈ దేశంలోని భామినులు
ఒళ్ళు కాల్చుకొని
చచ్చిపోడానికే సరిపోతుంటే ..

— వీరపల్లె వీణావాణి

డొకతను పెళ్ళి చేసుకొచ్చాడు ఆఫీసులో ముఖ్యస్నేహితులకీ, వాళ్ళ ఫామిలీలకి హోటల్ సిద్ధార్థలో రిసెప్షన్ ఇస్తున్నాడు వసుమతికి ఇలాంటి పార్టీలు చాలా ఇష్టం ఉత్సాహంగా ప్రియాంకను తయారు చెయ్యసాగింది. ప్రశాంతిని తలపైపైన దువ్వుకోని ముఖం కడుక్కురమ్మంది. పరికిణీ జాకెట్టిచ్చి వేసుకోమంది ప్రశాంతి తయారయ్యేసరికి ప్రియాంక ముస్తాబు కూడా అయింది. ప్రశాంతి చేతికి స్టీలుగిన్నె ఇచ్చి "అనసూయ పెద్దమ్మతో మనక్కూడా పాలు తీసుకోమని చెప్పు నువ్వు కూడా వెళ్ళవే ప్రియా!" అని తను ముస్తాబవటానికి బాత్ రూమ్లోకి వెళ్ళింది

పిల్లలిద్దర్నీ చూస్తూనే అనసూయకు వసుమతి పై విపరీతమైన కోపమొచ్చింది. ప్రశాంతి, వసుమతి తన అమెరికన్ జార్జెట్ చీర చింపి బోర్డరువేసి కుట్టిన పరికిణీ జాకెట్టు వేసుకుంది ప్రియాంక కోట్ నెక్తో, లాంగ్ అంబ్రెల్లా స్లీవ్స్తో ఉన్న తెలటి మాక్సీ వేసుకుంది మాక్సీ గుడ్డ పల్చగా దేవతా వస్త్రంలా వుంది దానికి తెల్ల లైనింగు వేసి కుట్టింది. పైనుండి క్రింద దాకా బాడీకి చేతులకు అంచెలంచలుగా కుచ్చు లున్నాయి. అక్కడ కూడా బంగారం రంగులా వున్న చెమ్కీలు కుట్టి వున్నాయి. తలకి ఆర్టిఫిషియల్ ముత్యాలున్న హెర్ బాండు పెట్టి దాంట్లో దొడ్లో పూసిన గులాబీ పెట్టింది. ప్రియాంక ప్రతి చిన్న కదలికకు మాక్సీ కుచ్చులు పౌర్ణమినాటి సాగర కెరటాల్లా ఎగిరెగిరి పడుతుంటే, చమ్కీలు తళుక్కున మెరిసి గంధర్వ బాలలా వుంది.

అనసూయ ప్రశాంతి నుంచి గిన్నె అందుకుంటూ అంది— "మీ అమ్మకిదేం

బుద్ధే మరీనూ! చిన్నదాన్ని సినిమా స్టారులా తయారు చేస్తుంది. నిన్నేమో అమ్మమ్మలా వుంచుతుంది?"

అనసూయ వసుమతి స్వభావం గురించి ఎప్పుడూ వసుమతితో అనలేక ప్రశాంతితో అంటుంది. ఆఅనటంలో ప్రశాంతిని నొప్పించే ఉద్దేశ్యం లేకపోయినా ఆవిడకు తెలియకుండా ప్రతిసారీ ప్రశాంతిని గాయపరుస్తుంది. ఇప్పుడూ అంతే అయింది. వడలబడినముఖంతో వెనుతిరిగి ఇంటికెళ్ళింది ప్రియంక వెంబడించగా! సరాసరి తండ్రి దగ్గరకెళ్ళి చెప్పింది "నాన్నా నేను రాను అనసూయ పెద్దమ్మ దగ్గరుంటాను. అక్కడే అన్నం తింటాను."

పిల్లలిద్దర్నీ చూడగానే ప్రశాంతి రానన టానికి కారణ మేమిటో వెంటనేగ్రహించాడు. అతని పితృ హృదయం అమితంగా బాధ పడింది. పైకి మాత్రం "అలాగేనమ్మా" అన్నాడు.

వసుమతి గట్టిగా ఏదో అనబోతుంటే చూపులతోనే వారించి బయటకి నడిచాడు. ప్రశాంతి ప్రక్కింటి కెళ్ళిపోయింది.

రామకృష్ణ ఆ సాయంత్రమంతా వసుమతితో చాలా ముభావంగా వున్నాడు. వసుమతికి కారణం అర్థం కాలేదు. అర్థం చేసుకునే తెలివి తేటలుంటే ఆమె ప్రవర్తన మరో విధంగా వుండేదేమో! ఆమెకు తన ప్రవర్తన అతిసహజంగా తోస్తుంది. అందాన్ని మెరుగుపర్చటానికి ఎంత చేసినా ఫరవాలేదు. కాని అందమే లేని చోట మెరుగులెందుకు ? ఇదీ ఆమె ఉద్దేశ్యం.

ఆ రాత్రి చాలాసేపు రామకృష్ణ పక్రి అవుతూ మేలుకునే ఉన్నాడు. వసుమతి ఎంత చెప్పినా తన అజ్ఞానం మూర్ఖత్వం వదిలించుకోకుండా వుంది. ప్రశాంతి పెద్దదవుతోంది. తల్లి ప్రవర్తన కారణంగా శాంతి శారీరకంగా కంటె మానసికంగా త్వరగా ఎదుగుతోంది. ఇది ఇలాగే కంటిన్యూ అయితే కేకి దారి తీస్తుందో! బాగా ఆలోచించి శాంతిని వచ్చే యేడాది మంచి బోర్డింగు స్కూల్లో హాస్టల్లో జాయిన్ చేసెయ్యాలని నిర్ణయించుకున్నాడు ప్రశాంతి తల్లి పక్షపాత ధోరణికి దూరంగా వుంటుంది. వసుమతి కూడా కూతురు దూరంగా వుంటే మారుతుందేమో! దూరం అనుబంధం పెంచుతుందంటారు కదా!

ప్రశాంతి, ప్రియంక చదువుతున్న కాన్వెంటులో ఒక చెడ్డ పద్ధతి వుంది చీటికీ మాటికీ ఏదోవంక బెట్టుకుని టీచర్సు పిల్లల్ని డబ్బులు తీసుకు రమ్మంటారు. కాన్వెంట్ బిల్డింగ్ ఫండ్ అనీ, వికలాంగుల సహాయార్థమనీ, గాయపడిన సైనికుల కోసమనీ, అనాథ బాల బాలికల కోసమనీ ఇలా రక రకాలు. మీకు తోచిందివ్వమని టీచర్సు పిల్లలకి చెప్తారు పిల్లలు వెళ్ళి తల్లి తండ్రుల్ని పీడిస్తారు ప్రశాంతి అడిగితే వసుమతి పావలానో అర్ధరూపాయో ఇస్తుంది. ప్రియంక కొంచెం గారాబంగా అడగ్గానే రూపాయి నోటిచ్చి పంపుతుంది. తక్కువ డబ్బులు తెచ్చిన పిల్లల్ని టీచర్సు నోటితో ఏమీ అనకుండా చూపులతోనే అవమానంతో ముడుచుకుపోయేలా చేస్తారు. సాటిపిల్లలు రకరకాలుగా హేళన చేస్తారు. దీనితో ప్రశాంతికి ఇల్లే కాకుండా స్కూలు కూడా నరకంగా తయారవసాగింది.

*　　　*　　　*

ఆరోజు శనివారం స్కూలుకి యూనిఫాం వేసుకోనక్కరలేదు. ఎవళ్ళకి కావలసినబట్టలు వాళ్ళు వేసుకోవచ్చు. ఆ రోజు స్కూలంతా సీతాకోకచిలుక సమూహంలా వుంటుంది. ప్రియంక ముద్దొచ్చే రోంపర్ వేసుకుంది. తనకున్న నాలుగు జతల బట్టల్నీ మార్చి మార్చి కట్టుకోవటానికి ప్రశాంతికి విసుగేస్తోంది. తల్లిమీద కోపంతో ఆ రోజు కూడా స్కూలు డ్రెస్సే వేసుకెళ్ళింది శాంతి. స్కూల్లో తన క్లాసు పిల్లలంతా బాగా గేలి చేశారు ఇంటర్వెల్‌లో ఆనందంగా ఎగురుతూ ఆడుకుంటున్న చెల్లెల్ని చూసి కోపం, అసూయ, దుఃఖం ముంచుకొచ్చాయి శాంతికి.

శనివారం మధ్యాహ్నం స్కూలుండదు. ఇంటికెళ్ళి ప్రశాంతి, ప్రియంక అన్నం తిన్నారు. ప్రశాంతి నిద్ర వాపుకోవటానికి హోం వర్కు ముందేసు క్కూర్చుంది. ప్రియంక తల్లి పక్కలో పడుకుని తల్లితో పాటు నిద్ర పోయింది. ఇద్దరూ గాఢంగా నిద్రలో మునిగారని ఖాయంగా నిర్ణయించుకున్నాక ప్రశాంతి పిల్లిలా లేచి తల్లి కుట్టు మిషన్ దగ్గర కెళ్ళి కత్తెర తీసుకుని తనవి చెల్లెవీ బట్టలుంచే పెట్టె దగ్గరకూర్చుంది. ప్రియంక అందమైన బట్టలన్నీ ఒక్కొక్కటి తీసి చేతికందిన చోటల్లా కత్తిరించసాగింది. ముందుగా తెల్ల మబ్బుల మాక్సీ, తరువాత బుల్లి లంగా, బుల్లి వోణీ కలిపి కుట్టినచీర, తరువాత చుడీదార్ పైజమా, తరువాత వాఫ్‌వైట్ సిల్కు పైజరీ దారంతో ఎంబ్రాయిడరీ చేసిన కఫ్తాన్! ఒక్క డ్రెస్సూ రూపు లేకుండా పోతుంటె ఇన్నాళ్ళనుంచి ప్రశాంతిలో చెలరేగుతున్న మంటలు చల్లారుతున్నట్టుంది. కొంచెం సేపయ్యేసరికి బరువైన కత్తెర పట్టుకున్న చిన్నవేళ్ళు నొప్పెట్ట సాగాయి. కొంచెం సేపాగుదామని కత్తెరతీసి కింద పెట్టబోతుంటే చేయిజారి పెద్దగా శబ్దం చేస్తూ కిందపడింది. వసుమతి, ప్రియంక ఇద్దరూ లేచి వచ్చారు. ప్రశాంతిముందున్న పీలికల గుట్ట చూసి ప్రియంక నేలమీదపడి దొర్లుతూ ఏడవసాగింది. వసుమతికొయ్యబారి పోయింది. తను ఆ బట్టలు కుట్టడానికి పడిన గంటల గంటల శ్రమ, ఒక్కో డ్రెస్సులో తన ముద్దులప్రియ రూపం గుర్తొస్తుంటే కోపంతో పూర్తిగా ఒళ్ళు మరచి పోయింది. ప్రశాంతిని జడలుపట్టి లేపి తలగోడ



కేసికొట్టింది. తరువాత దెబ్బ తగిలిన చోటల్లా శక్తికొద్దీ బాధ సాగింది. ప్రియంక భయంతో ఏడుపాపేస్తే, బాధతో ప్రశాంతి బిగ్గరగా ఏడవటం మొదలెట్టింది. ఎప్పుడూ అంతగట్టిగా వినిపించని ఏడుపువిని అనసూయ పరుగెత్తుకొచ్చింది. తలుపులు దబదబ బాదుతుంటె ప్రియంక గడియతీసింది. గబుక్కున ప్రశాంతిని దగ్గరకు తీసుకుని "ఎందుకని దాన్ని అలా కొట్టుకుంటావు ? మతి పోయిందా" అంటూ మందలించింది.

"కొట్టాలా ! కొయ్యాలా ? చూడండి ఏంపని చేసిందో? ఇది చచ్చినా పీడా పోను ఒక ఏడ్పు ఏడ్చి ఊరుకోవచ్చు"

అనసూయ చిరిగిన బట్టల్ని, గొంతు తగ్గించి తన కుచ్చెళ్ళు పట్టుకుని ఏడుస్తున్న ప్రశాంతిని చూపింది. వసుమతికేసి ఈసడింపుగా చూసింది "శాంతి చేసిన పనికి కారణం ముమ్మాటికీ నువ్వే !" ప్రశాంతిని ఎత్తుకుని తన ఇంట్లోకి వెళ్ళిపోయింది.

రామకృష్ణ ఆఫీసు నుంచి వచ్చిన మరుక్షణమే ప్రియంక సంగతంతా అతని చెవిలో వూదేసింది. అతను వసుమతినేమీ అనకుండా పక్కింటికి వెళ్ళాడు ప్రశాంతిని తీసుకురావటానికి. ఆవిడిచ్చిన జవాబు అతడ్ని భయపెట్టింది. తను ఓదార్చగా ఓదార్చగా స్థిమితపడి గంట క్రిందటే మీ ఇంటికెళ్ళిపోతానని చెప్పి వెళ్ళిపోయింది. ఇంటిదగ్గర లేదూ మరి ఏమయినట్లు !

తిరిగివచ్చి భార్యతో అదే అన్నాడు. వసుమతి ఏమాత్రం కంగారు పడలేదు. "ఎక్కడికి పోతుంది ? కడుపులో మాడితే తిండి సమయానికి అదే చేరుకుంటుంది."

రామకృష్ణ వసుమతి కేసి అసహ్యంగా చూశాడు. "నువ్వసలు తల్లివేనా ? నా కళ్ళకిపుడు నరరూప రాక్షసిలా కన్పిస్తున్నావు. చిన్నదయినా దాని సహనానికి హద్దుంటుందని తెలుసుకోకుండా ప్రవర్తించావు. ఈ ట్రాఫిక్‌లో- ఎక్కడ కెళ్ళిపోయిందో! దేని కింద పడిందో !"

ఈ ఆలోచనే కళ్ళలో నీళ్ళు తిప్పుతుంటే, వెతకడానికెళ్ళాడు. విషయం తెలిసిన అనసూయ భర్త కూడా మరో దిక్కు కెళ్ళాడు.

వసుమతి కోపం చల్లారుతుంటే, ఓ ప్రక్క కొంచెం సిగ్గుగా మరో ప్రక్క ఆదుర్దాగా వుంది. ఏ వస్తువయినా జార విడుచుకున్నాకనే దాని విలువ తెలుస్తుంది. చచ్చినవాడి కళ్ళు చారెడని ఊరికే అన్నారా ?

ఎనిమిది గంటలకి నీరసంగా, నిరాశగా, ఆవేదనతో పోలీసు రిపోర్టిచ్చి ఇంటికి చేరుకున్నాడు రామకృష్ణ. దిండు ముఖంమీద వేసుకుని మంచం మీద వెల్లకిలా పడుకున్నాడు. వసుమతి మెల్లగా ఏడవ సాగింది. రామకృష్ణ ఆమెని ఓదార్చే ప్రయత్నమేం చెయ్యలేదు.

ఇక్కడ వీళ్ళిలా ఆత్రుత పడుతుంటె ప్రశాంతి కాన్వెంటులో సిస్టర్ సుపీరియర్ ఒళ్ళో సాంత్వన పొందుతోంది. అనసూయ గారింటి నుంచి సరాసరి కాన్వెంటులో చర్చికెళ్ళిపోయి ఒక బెంచీ మీద కూలబడి ఏడవ సాగింది. ఈవెనింగ్ ప్రేయర్ కోసం చర్చిలోకి వచ్చిన సిస్టర్ మనసు కరిగిపోయింది. మెల్లగావెళ్ళి ప్రశాంతి తలపై చెయ్యివేసింది. ఉలిక్కిపడిన ప్రశాంతికి భయంలేదని ఓదార్చి తన డిపార్ట్‌మెంట్‌కి తీసుకెళ్ళింది. సిస్టర్ బుజ్జగింపు, ఆవిడ ముఖంలోని కారుణ్యం ప్రశాంతి చేత అప్రయత్నంగా మనసులోని ఆరాటాన్నంతా వెళ్ళగక్కించింది– ఆ రోజు జరిగిన సంఘటనతోసహా ! సిస్టర్ కి వసుమతిపై, గట్టిగా జోక్యం చేసుకోని రామకృష్ణపై కోపం పొంగి పొరలింది.

ప్రశాంతి ససేమిరా ఇంటికి వెళ్ళనంటే, భోజనం పెట్టి స్పేర్ కాట్ వేయించి నిద్రపుచ్చింది. మర్నాడు కాన్వెంటు అటెండర్‌తో రామకృష్ణ వసుమతిలను తనను కల్సుకో వల్సిందిగా కబురు చేసింది.

వాళ్ళు రాగానే తను ఒక్కతే వాళ్ళని కలవటానికి వెళ్ళింది. ప్రశాంతి క్రిందటి రాత్రి చర్చికి రావటం, తను చేరదీయటం చెప్పి ఇలా అంది. ఆమె ముఖంలో ఇప్పుడు ప్రశాంతి చూసిన దయ, ఆర్ద్రత లేవు. గంభీరత కఠినత్వం మాత్రం వుంది.

"చూడండి మిసెస్ రామకృష్ణా! మీరు అజ్ఞానంలో బిడ్డ మనసులో చెరగిపోనిగాయం చేశారు. ఏమయినా మీ యింటికి రానంటోంది మీరు కాదుకూడదని బలవంతంగా తీసుకెళ్తే ఇంకెక్కడికయినా పారిపోవచ్చు. అప్పుడు ఆమె జీవితం ఏమవుతుందో ఎవరికీ తెలియదు. నేను వృద్ధురాలిని. శాంతిని పెంచి పరిపూర్ణ వ్యక్తిత్వం గల స్త్రీగా పెంచే గురుతర బాధ్యత నిర్వహించే శక్తి, కాలమూ నా దగ్గర లేవు. అందుచేత నేను చాలా ఆలోచించి ఒక నిర్ణయం తీసుకున్నాను. విదేశాలలో సంతాన విహీనులయిన దంపతులు చాలామంది అనాధ బాల బాలికలను పెంచుకోవాలని కుతూహల పడుతున్నారు, వారిదేశమేదైనా! నాకున్న పరిచయాల సహాయంతో శాంతిని అందులో ఒక మంచి కుటుంబంలోకి పంపించాలనుకుంటున్నాను. లిటరల్ సెన్సులో శాంతి అనాధ కాకపోవచ్చు. ఆమె తల్లి తండ్రులున్న అనాధ. అది మరీ బాధాకరమైన పరిస్థితి. తనని నిరసించే వ్యక్తుల మధ్య వ్యక్తం కాలేని శాంతి గుణ గణాలు టాలెంట్స్ ప్రేమాభిమానాలు మరిపించే వ్యక్తుల మధ్య వికసించి వృద్ధి చెందగలవు. జరిగినదంతా శాంతి నోట విన్నాక, కొత్త వ్యక్తులయినా తనని ప్రేమించే వారితో అడ్జస్టు అవటానికి ఇబ్బంది పడదని నేననుకుంటున్నాను. మీ నిర్ణయం రేపటిలోగా చెప్పగలరా?"

లేవబోతున్న సిస్టర్‌ను ఆపాడు రామకృష్ణ. "సిస్టర్! మీరిచ్చిన సలహా బాగుంది. నేనెలాగూ ప్రశాంతిని హాస్టల్లో చేర్పించాలనుకున్నాను. కాని ఈ ఏర్పాటు యింకా నచ్చింది. శాంతి ఒక చల్లని యింట్లో క్షేమంగా, ఆనందంగా ఉందన్న ఆలోచన శాంతి నా కళ్ళెదుట లేని లోటును పూడుస్తుంది. ఇందులో వసుమతి ప్రమేయమేమీ లేదు తల్లి ప్రేమ పంచివ్వలేని ఆమె తల్లి అధికారాన్ని పోగొట్టుకుంది. సెలవు సిస్టర్"

కన్నీళ్ళు సిస్టర్‌కి కనబడకుండా గిరున తిరిగి వెళ్ళిపోతున్న భర్తను అదే స్థితిలో అనుసరించింది వసుమతి.

దొంగలించబడతాయి !

స్త్రీలు ... !
శిల్పాలు ...
లేవు తారతమ్యాలు
ఒకటి గౌరవింపబడతాయి
మరొకటి పూజింపబడతాయి
రెండు కూడా
దొంగలించ బడతాయి!

– "అజ్ఞద్"






బులుసు వేంకటరమణయ్య

# ఆప్తవాక్యమే ప్రమాణం

మన మేలు కోరేవారు ఆప్తులు. వారు చెప్పిన విధంగా నడుచుకోవాలి. ఎందుకు ఇలా చెయ్యాలి ? అని కుశంకలు కలగనే కూడదు. "సత్యమే పలుకవలెను" అని చెప్తే "ఎందుకు పలకవలెను ?" అని ఎదురు ప్రశ్న వెయ్యకూడదు "అబద్ధ మాడకూడదు కాబట్టి" అని తనకే సమాధానం తోస్తుంది. అలాగే "జీవహింస చెయ్య కూడదు!" అని బోధిస్తే "ప్రాణుల బాధించడం మంచిది కాదు" అని సమాధానం తోస్తుంది. మనం ఏ పనిని చెయ్యదలచినా సరే! ఆ పనిని అప్పగించిన తన సేవకులపై నమ్మకం వుండాలి నమ్మకం లేకపోతే, ఆ పనిని జరపడం సాధ్యం కాదు ఈ లోకంలో మనం చూడనివి ఎన్నో ఉన్నాయి. ఇతరులు వాటిని గురించి చెప్తే వారి మాటలను విశ్వసించి, అని ఉన్నాయని తెలుసుకుంటున్నాము

దేవుని విషయంలో కూడా ఇంతే! హేతువాదుల్లో కొందరు "దేవుడున్నాడా ? మన కంటికి కనబడుతున్నాడా ?" అని తిక్క ప్రశ్నలు వేయవచ్చు. మహానిగ్రహం కలిగి సమాధి నిష్ఠులై, అంతర్దృష్టితో నిర్గుణ బ్రహ్మ స్వరూపాన్ని చూచి, చెపుతూ ఉన్నారు కాబట్టి, వారి మాటలను విశ్వసించి దేవుడున్నాడని గ్రహించవలసి ఉన్నది

దేవుని ఉనికిని గురించి ప్రసంగిస్తూ కంచి కామకోటి పీఠాధీశ్వరులగు శ్రీ శంకరాచార్య స్వామివారు చెప్పిన ఈ క్రింది విషయాన్ని మనం గ్రహించాలి. "మన కన్నుల యెదుట కనబడుతూ మనలను పోషిస్తున్న మన జనకుణ్ణి మనం ఎరుగం. మనకు మిక్కిలి హితురాలైన తల్లి చెప్పిన తర్వాత మనకు, ఆయన తండ్రి అనే విశ్వాసం కలుగుతుంది. ఆయన యెడల మనం ఎంత భక్తినీ, గౌరవాన్నీ చూపుతున్నాం. తల్లి చెప్పకపోతే-ఆయన తండ్రి అని మనం తెలుసుకోలేము ఎదుట కానవస్తున్న తండ్రిని గురించే మనకు తల్లి చెప్పితేగాని యధార్థ జ్ఞానం కలగటం లేదు. సర్వవ్యాప్తియై, మన కనులకు కానరాని భగవంతుని గురించి నిశ్చయజ్ఞానం మనకు ఆప్త వాక్యం వల్లనే కలుగవలసి ఉన్నది"

ఆప్తవాక్యమే ప్రమాణమైనది దాన్ని ప్రమాణంగా గ్రహించకపోతే ఎందులోనూ నిశ్చయజ్ఞానం కలుగదు. మనస్సు సదా సంశయంలోనే మునిగి ఉంటుంది

# టాప్ స్టార్ ఉన్న కప్పు ఏది ?



## చూడండి, ఇక్కడ చిక్కని, కమ్మని టీ ఉన్నది

**చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం**
**రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం**

చిక్కదనపు పరీక్ష...చేసి చూడండి...టాప్‌స్టార్ అన్నిటికన్నా మెరుగు...మరే ఇతర టీకన్నా చిక్కనిది — చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్.

ఎందుకంటే, ప్రత్యేకమైన భారతీయ తేయాకుల తాలూకు ఘాటైన (స్ట్రాంగ్) సమ్మేళనం నుంచి తయారైంది లిప్టన్ టాప్‌స్టార్... సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ కోరుకునే వారి కోసం!




# లిప్టన్ టాప్ స్టార్ టీ

**చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్**

LIPTON

LINTAS-LTS. 6-2315 TL.

### గ మ ని క

గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జతపరచవలసి వుంటుంది. గేయాలు త్రిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది.

సం.




### 26-2-1982 శుక్రవారం మొదలు
### 4-3-1982 గురువారం వరకు

★ మేషం : సర్వవిధాలా, సర్వరంగాలలో, సాధారణ వ్యవహారాలలో భారీ వ్యాపారంలో, అనుకూలమే. రావలసిన బాకీలు వసూలు కాగలవు. గ్రహించండి. రాజకీయవాదులకు, క్రీడారంగానుభవం కలవారికి మేలుంటుంది. స్త్రీలకు : ఆదాయం, వృత్తిలో వృద్ధి, కార్మికరంగంలో ప్రగతి గలదు.

★ వృషభం: అభీష్ట ప్రకారం కార్యానుకూలత గలదు. పదిమందిలో పేరుప్రతిష్ఠలు ఉండగలవు. వ్యాపారం ఒడుదుడుకులు లేకుండ జరిగిపోతుంది. సుఖం, ఆనందం, కుటుంబానందం గల వారం. కొందరకు ఉద్యోగావకాశానికి అనుకూలం. స్త్రీలకు : వృత్తి, ఉద్యోగాలందు, ఆదాయంలో అభివృద్ధి గల వారంగా గ్రహించేది.

★ మిథునం : నాల్గు విధాలా మేలుంటుంది. కళాసాహిత్య వ్యవహారాలలో చాలమందికి, రాజకీయ వ్యవహారాలలో కొందరకు, క్రీడారంగంలో కొందరకు మేలు సంభవం. వ్యాపార విస్తరణ కార్యక్రమం సాఫీగా సాగిపోతుందని గ్రహించాలి. స్త్రీలకు: నాల్గు విధాలా మేలు, రాజకీయంగా అనుభవం కలవారికి అభివృద్ధి చేకూరగల వారం.

★ కర్కాటకం : నిశ్చయంగా ధనాదాయం, కళారంగంలో మేలు, ఆదాయం అభివృద్ధి చెందటం రావలసిన బాకీలుంటే సమయానికి చేతికందటం, గమనింపనున్నారు. క్రీడవనిలో కొందరకు అభివృద్ధి చేకూరగలగటం, విద్యార్జనయందు విద్యార్థి విద్యార్థులకు మేలు చేకూరగల వారం. స్త్రీలకు: అనుకూలత అన్ని రంగాలలో, అభివృద్ధి ఉద్యోగంలో ముఖ్యంగా కనిపిస్తుంది.

★ సింహం : ముఖ్యంగా గ్రహించవలసిన దేమంటే, తీర్థయాత్రార్థమో, పుణ్యకార్యార్థమో, కార్యానుకూలతకో, వారం మంచిదిగా గడిచిపోతుంది. మీలో ఒకరుగా చెలామణి అయ్యే వారితో మాట పట్టింపులు రాగల అవకాశముంటుంది. జాగ్రత్త. స్త్రీలకు : ఆనందం, హాయి, సంతానం మూలంగా సంతోషం, శుభకార్య ప్రస్తావనలకు అవకాశముంటుంది.

★ కన్య: న్యాయసమ్మతంగా కొన్ని విషయాలలో ఆనందం కల్గుతుంది. ఆయువోజ వృద్ధికావటంతో నూతనోద్యోగ ప్రయత్నం ఒకవేళ కొందరకు సాగి రాగలదు. ఒకానొక ముఖ్యమైనది, సంతోషదాయకమైనది వినగల్గుతారు. స్త్రీలకు: నూతన వ్యవహారాలలో జోక్యం, విలువగల వస్తు సేకరణకు అవకాశమున్నదని గ్రహించాలి.

★ తుల : గురు గ్రహం మూలాన శుభవ్యయం జరగనున్నది. ఆర్థికంగా ఇబ్బందులుండగలవు. గడచిన వారానికన్నా బాగుండుటకు, అన్ని హంగులు ఏర్పడుటకు ఏమాత్రం ఇబ్బందిలేదు. సమయానికి ఎవరో మిమ్ములను ఆదుకోగలరు. ఆటపాటల్లో ప్రవేశమున్నవారికి శుభకాలమే. స్త్రీలకు : ఆదాయం, వృత్తిలో అభివృద్ధి క్రీడావనిలో అవకాశాలుంటాయి.

★ వృశ్చికం : సరి అయిన వారి సహవాసం ఏర్పడనున్నది. అందుమూలాన మేలు సమకూడుతుంది. కోర్టు వ్యవహారాలుగాని, పరిష్కరింపదగిన వ్యవహారాలున్నా సుకరంగా నెరవేరనున్నవి. మీరు వ్యాపారులైతే అనుకూలమే. క్రయవిక్రయాల కొరకు దూరదేశ ప్రయాణాలుండగలవు. భూమిగాని, విలాసవస్తువులుగాని ఏవైనాగాని కొనుగోలు చేయనున్నారు. స్త్రీలకు : ఒడిదుడుకులు లేని వ్యాపార ఉద్యోగములందు ప్రగతి కనిపించే మార్గమున్నది.

★ ధనుస్సు: జీవన మార్గాన్ని సరిదిద్దుకొనుటకు అవకాశమున్నది. నూతన వ్యవహారాలు సుగమంగా నెరవేరనున్నవి. ఈవారం నేర్పరులైన మిత్రులో, బంధువులో మీకు సహాయపడనున్నారు—అని గ్రహించండి. స్త్రీలకు: వస్తువాహన సేకరణకు, ఉద్యోగ ప్రయత్నాలు ఫలితానికి రావటానికి అవకాశమేర్పడుతుంది.

★ మకరం : కన్యలుగా ఉండే వారికి వివాహ ప్రయత్నాలు ఫలితానికి రానున్నవి. అలాగే ఈ రాశి బ్రహ్మచారులకుకూడ మీపరిస్థితులు ఆర్థికరంగాన దినదినాభివృద్ధినందనున్నది. సుఖసంతోషాలకు, కుటుంబానందానికి, క్రీడావనిలో అవకాశాలకు, రాజకీయంగా అనుకూలత చేకూరుటకు ఏ విధంగా ఇబ్బందిలేదు. స్త్రీలకు: ఆదాయంలో వృద్ధి, ఆనందం చేకూరగల వారమే.

★ కుంభం : కరుకుదనం తగదు. పరులవలన మాటలు తినే పరిస్థితి ఏర్పడగలదు. అలాంటి గ్రహస్థితి గలదు. సమయానికి సరి అయిన సలహాలు ఇచ్చేవారుంటారు. వారిని గమనించి మెలగండి. స్తోత్రప్రియులు చేరుతారు, లొంగకండి. స్త్రీలకు : రాజకీయ మార్గంగా మేలు, క్రీడావనిలో అవకాశాలుండగలవు.

★ మీనం : మంచివారి సహాయం, ముఖ్యంగా ఆర్థికరంగంలో మీకు సానుకూలమవుతుంది. ఈ వారం మీకు అన్ని రంగాలలో ప్రోత్సాహం సమకూడుతుంది. కొందరు నూతనవ్యాపారాలు ప్రారంభింపగల్గుతారు. స్త్రీలకు : నూతనోత్సాహం, నూతనోద్యోగావకాశం, నూతన వస్తు సేకరణకు అనుకూలత సమకూడనున్నది. గ్రహించండి.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి


ఎక్కడ
లైఫ్‌బాయ్
ఉన్నదో అక్కడ
ఆరోగ్యము ఉన్నది
లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానం చేస్తే మీకు పరిశుభ్రంగా ఉంటుంది. తాజాగా, హాయిగా వుంటారు. లైఫ్‌బాయ్ వాదకం మీకు ఆరోగ్య ప్రదమైనది. జ్ఞాపకం వుంచుకోండి.
లైఫ్‌బాయ్
మురికిలో గల క్రిములను
కడిగి వేస్తుంది
LIFEBUOY
for health
LIFEBUOY
SOAP



సీరియల్

మానవులలో సమానత్వం రావాలన్నా, తోటి మనిషిని పీడించటం మానేసి ప్రేమించాలన్నా, అభ్యుదయం కోసం ప్రయత్నించాలన్నా,— పార్టీ సిద్ధాంతాలలో దేనిని అమలు జరపాలన్నా— ముందు జనంలో భావ చైతన్యం కావాలి!

ఆలోచనా శక్తి రావాలి!

వివేకం పెరగాలి!

అందుకు— విద్య కావాలి!

అవును!

ప్రతి వ్యక్తికీ విద్య కావాలి!

దేశంలో నిరక్షరాశ్యతను నిర్మూలించాలి! 'నిరక్షరాస్యతే ఉండకూడదు' అంటే చదువుకున్న ప్రతి యువతీ, యువకుడూ నడుంకట్టి ముందుకురావాలి!

వయోజన విద్య ప్రారంభమయింది ప్రతిరోజూ రాత్రిపూట 12 గంటల వరకూ విద్య నేర్పుతూ ఉండేవాడు అతనికి అండగా ఎంతో మంది మిత్రులు ఉండేవారు,

ఒక్కోనాడు ఉపాధ్యాయ పని ఇంకెవరికైనా అప్పజెప్పి, తను ఎక్కడికో వెళ్ళేవాడు

ఎక్కడికో ఏముంది !

ఏ పెద్దింటి పురినో తరలించి పేద ప్రాణాలెన్నిటికో ఊపిరిపోసి వచ్చేవాడు!

కొన్ని గొంతుకలు అతడ్ని శపించేయి! అదే సమయంలో మరో కొన్ని వేల కంఠాలు ఎలుగెత్తి ఆశీర్వదించేవి !

(గత సంచిక తరువాయి)

ఇలాటి కార్యక్రమాలన్నీ చాలా ప్లానుగా చేసేవాడు

ముందరరోజు ఆ యింటికి ఒక చీటి పంపించేవాడు లేదా, తెల్లవారే సరికి గోడలకు అంటించి ఉండేది! దానిలో "ఇవ్వాళ 'ఇంత' మందికి ధాన్యం పంచిపెట్టు, ఆకలితో అల్లల్లాడే ఆ ప్రాణుల్ని— పురుగులు, ఎలుకలూ పాడుచేస్తున్న నీ ధాన్యాన్ని పంచి కాపాడు," అని ఉండేది ఆ రోజు అతను తన ఇంటి ముందరకొచ్చిన ఆ అన్నార్తులకు ఆహారం పంచాడా, సరి! లేకుంటే ఆ రాత్రి అతని 'పురి' లోవివి ఎంతకావాలో అంత ధాన్యం తీసుకుని, తీసుకున్న ధాన్యం ఎంతో ఒక చీటీమీద వ్రాసి, ఆ చీటీని గోడ కంటించి, ఎర్రజెండాను దిద్ది వెళ్ళి పోయేవారు

ఎవరైనా ఇది 'పాపం' అని అంటే వెంకట్ వాదించేవాడు

'ఇందులో పాపమే ముంది! అసలు పాపమంటే ఏమిటి ? సహాయం చేసే శక్తి ఉన్నా, చేయకుండా చేతులు ముడుచుకుని కూర్చోవటం పాపం! పది మందికి పెట్టే శక్తి ఉన్నా, పెట్టకుండా తానొక్కడే దాచుకోవటం నేరం! వాడు ఛస్తూ అవన్నీ ఎట్టుకెళ్తాడా! లేదు! అలాంటపుడు వాడికి కావలసింది ఉంచుకుని మిగిలింది లేనివాడికి పంచాలి! అలా వాడికి పంచటం చేతకా లేదనుకోండి! చేతనయిన వాళ్ళు పంచుతారు ! మంచిగా చెప్పి చూసాం! వాడు వినలేదు! బలవంతంగా చేసి చూపింమతాం! చేదుగా ఉన్నంత మాత్రాన మందులు మింగకుండా ఉంటున్నారా? ఇదీ అంతే! ఇందులో తప్పేముంది? పాపమేముంది ? వాడికేమీ మిగల్చకుండా మొత్తం తీసుకొ లేదుగా?" అనేవాడు

అతనితో వాదించటం— హిమాలయాలను ఎక్కాలనుకోవటం — ఒకటే!

వజ్రంలాటి పదును గల వెంకటరత్నం చాలా కొద్దికాలంలోనే గుడ్లవల్లేరుల్లోని అందరకూ తెలిసిపోయాడు

కొందరకు అతడంటే— హడల్! మరికొందరకు అతడంటే ప్రాణంతో సమానం! దైవం కంటే మిన్న !

తార కూడా ఇరుగు పొరుగులతో మంచి పరిచయాలను ఏర్పరచుకున్నది

ఇపుడు తార మరల గర్భవతి! అపుడపుడూ వెంకట్ అనేవాడు, "తారా, ఈ సమయంలో మనస్సు అతి ప్రశాంతంగా ఉంటే మంచిది! ఇక్కడ నా కార్యక్రమాలకు సమయాసమయాలు ఉండవు! ఇలాటి పరిస్థితుల్లో నీ ఆరోగ్యం పాడవుతుందేమో తారా! మీ యింటికి గానీ, మా యింటికి గానీ— నీ యిష్టమొచ్చిన చోటుకు వెళ్ళు! బాబుని తీసుకుని వద్దువ గాని!"

"ఉహూ — ఏ ఇంటికీ వెళ్ళను, మన ఇంట్లోనే ఉంటాను నాకు మీ సన్నిధికన్నా వేరే ఏ చోటూ ఆనందాన్నివ్వలేదు ! నన్నెక్కడకూ పంపవద్దు" అనేది తార

*　　　*　　　*

గుంటూరుజిల్లా 'చిలువూరు'లో 'అఖిలభారత మహిళా సభలు' జరుగుతున్నాయి

వాటికి వెళ్ళితీరాలన్నాడు వెంకటరత్నం

అతని ఆజ్ఞకు తిరుగేమున్నది ! పైగా తారతో పాటుగా ధనలక్ష్మి, ఇంకా కొందరు కూడా బయలుదేరుతున్నారు

ఎవరి ఆంక్షలూ లేకుండా, కోపతాపాలు లేకుండా, బతిమాలుకోవటాలు లేకుండా – ఇన్నేందుకు ఏ ఆటంకాలూ లేకుండా తార ఎంతో సంతోషంగా బయటకు బయలుదేరిన మొట్టమొదటి మహాసభ !

గ్రామాన్ని ఎంతో అందంగా అలంకరించారు ! ఎక్కడెక్కడినుండో ప్రభలు కట్టుకుని వచ్చారు !

ఎటుచూసినా ఎర్రజెండాలే !

సమస్త ప్రాణికోటికీ ఊపిరి పోసే సూర్యోదయపు అరుణ బింబంలాటి ఎర్రటి ఎఱుపు !

మనుషులంతా ఒక్కటే అని నిరూపించుతూ మానవులందరిలోనూ ప్రవహిస్తున్న రక్తప్రవాహంలాటి ఎఱుపు !

చుట్టూ తడికెలు కట్టి హద్దులు ఏర్పరచారు ! ఆ తడికెలనిండా ఎఱ్ఱని జెండా కాగితాలు అంటించారు ! చుట్టూ పెద్ద పెద్ద వాసాలకూ, చిన్న కర్రలకూ కట్టి ఎగురవేసిన ఎఱ్ఱని జెండాలు ! కొన్ని పెద్దవిగా, కొన్ని చిన్నవిగా గాలికి రెపరెపలాడుతూ ఎగురుతూంటే హృదయాల్లోని భావాలు కూడా ఉప్పొంగుతూండేవి !

జరిగిన కథ—11 రాఘవయ్య, నాగరత్నం దంపతులకు తార, సరళ—రామారావ్, రామ్మోహన్, చంద్రం సంతానం కమ్యూనిస్టు పార్టీ ప్రముఖులలో ఒకడుగా పేరు తెచ్చుకుంటాడు వెంకటరత్నం శ్రీనివాసరావ్‌తో కలసి ప్రసాద్ పెళ్ళికి వెళ్ళిన వెంకటరత్నం మదిలో 'అనుకోని సంఘటన' ద్వారా ముద్రవేసుకొంటుంది తార ఎవరెన్ని విధాల నచ్చజెప్పినా వినక వెంకటరత్నాన్నే పెళ్ళి చేసుకొంటుంది తార భర్తపైన ఉండే గౌరవంకొద్దీ అతను పంపే ఉత్తరాలతోపాటు పార్టీ పుస్తకాలు కూడా చదువుతూ ఆనాటి రాజకీయాలను అవగతం చేసుకొంటుంది తార బెజవాడలో జరగబోతున్న మీటింగులకి వెళ్దాం రమ్మని తారకు ఉత్తరం ద్వారా తెల్పుతాడు వెంకటరత్నం తండ్రి వెళ్ళొద్దని వారించినా వినక ఎన్నో బాధలకోర్చి అతన్ని కలుసుకొంది తార రాఘవయ్య నిరాదరణతో వెంకట్ వెంట వచ్చిన తార అత్తగారింటి పరిస్థితుల్ని అవగాహన చేసుకుంటుంది ఉత్తరం ద్వారా తార గర్భవతి అని తెలుసుకొన్న రాఘవయ్యగారు పరమానందభరితులై, రెండు మూడు రోజుల్లో వచ్చి చూస్తానని చెబుతారు పురిటికి పుట్టింటికి వెళ్తుంది తార కూతురి పేరు 'స్వప్న' అని పెట్టుకొంటాడు వెంకట్ చదువు కోసం గుడివాడ వెళ్ళిన కళ్యాణి పార్టీలో పనిచేసే సీతారామయ్యని ప్రేమించి అతన్నే పెళ్ళి చేసుకొంటానని ఖచ్చితంగా ఇంట్లో చెప్తుంది సత్యవతమ్మ గొడవచేస్తుంది ఎలాగైతేనేం సత్యవతమ్మను ఒప్పించి కళ్యాణిని సీతారామయ్య కిచ్చి వివాహం చేస్తారు గుడ్లవల్లేరు ఫిర్కాకు పార్టీ కార్యదర్శిగా వెంకట్‌ను నియమించడంతో తన కుటుంబంతో అక్కడ కాపురం పెడ్తాడు

ఎంతో క్రమశిక్షణతో, గల్లంతులేమీ జరగకుండా, అతి ప్రశాంతంగా జరుగుతున్నాయి సభలు! వారిచ్చే ఉపన్యాసాలు, వారు చెప్పే ప్రతి మాటా — అందరినీ ఉత్సాహ పూరితం చేస్తున్నాయి! ప్రతివారినీ చైతన్య స్రవంతులుగా మార్చుతున్నాయి!

రక్తాన్ని ఆవేశపరచి, ప్రపంచంలోని అన్యాయాన్ని అంతటినీ అంతం చేసేయాలనిపించేది!

మనుషుల్లో కుంచించుకుపోయిన కల్మషాన్ని ఊడిగి పారేయాలనిపించేది!

ఆకలీ, అలసటా, నిద్రా ఏవీ గుర్తుకొచ్చేవి కావు!

ఆడ, మగ — లింగ భేదాలుండేవికావు!

పెద్ద, చిన్న వయసు తేడాలు తెలిసేవికావు!

అదొక యజ్ఞం!

ప్రతిరోజూ సాయంత్రం పూట ఊరేగింపు జరిగేది! ఆ నినాదాలు వింటూ, ఆ ఊరేగింపు చూస్తుంటే మన ఒళ్ళు మనకు తెలిసేది కాదు! మన మనస్సు మన అధీనంలో ఉండదు!

ఉరుకుల పరుగులతో వెళ్ళి, వాళ్ళల్లో కలిసి పోవాలని ఉంటుంది!

అసలు—ఆ వాతావరణం చూస్తేనే ఏమీ తెలియని వారికి కూడా ఎర్రని బాడ్జి తగిలించుకుని, ఎర్రజెండా పట్టుకుని—

మహిళా సంఘాలకూ— జై!

కమ్యూనిస్టు పార్టీ— 'వర్ధిల్లాలి!

ఎర్ర జెండా— వర్ధిల్లాలి,

అంటూ నినాదాలు చెప్పాలని అనిపిస్తుంది!

మొదట్లో కేవలం ఉబలాటం కోసం అరచినా— ఆ అరుపులు రానురానూ జీవిత ధ్యేయాలుగా మారి పోయేవి!

మంచి నిద్రలో ఉన్నా "బోలో భారత స్వతంత్ర కమ్యూనిస్టు పార్టీకీ— జై!!" అంటూ నినాదాలు వినిపిస్తున్నట్లే చటుక్కున లేచి కూర్చునేవారు!

అదొక ఉప్పెన!!

* * *

స్టేజి మీద 'రేణూ చక్రవర్తి' ఉపన్యసించుతోంది

ఆమె బెంగాల్ మహిళా మండలి లీడరు! హిందీలో చెబుతున్న ఆమె భావాలను తెలుగులోకి అనువదించి వినిపించుతున్నారు

తెల్లని దిండ్లను ఆనుకుని కూర్చుంది రేణూ చక్రవర్తి

చిన్నదిగా ఎరుపు బోర్డరున్న తెల్లని నూలుచీర, తెల్లని రవికెలో స్వచ్ఛతకూ, ప్రశాంతతకూ మారురూపులా ఉందామె! కళ్ళద్దాలలోంచీ కన్పిస్తున్న ఆమె కళ్ళు విజ్ఞాన ఖనులలాగా ప్రకాశిస్తున్నాయి!

ఎడంచేతికి వాచీ కట్టుకుని ఉన్నది! ఆమె ఒంటిపై వేరే ఇతర ఏ ఆభరణాలూ లేవు!

నుదుట సింధూరం!

గుండెమీద ఎర్రని బాడ్జి! ఆమె వెనుక స్టేజీనంతా కవర్ చేస్తున్న ఎర్రని శాటిన్ బట్టపైన కమ్యూనిస్టు గుర్తును తెల్లని బట్టతో కుట్టారు!

ఆమె వెనుక ఇంకా కొంతమంది లీడరు కూర్చుని ఉన్నారు

రేణూ చక్రవర్తి కంఠం అతి మృదువుగా, ఆవేశపూరితంగా, ప్రజలను ఆజ్ఞాపిస్తున్నట్లుగా పలుకుతూంది

ఆమె పలుకులు నలుమూలలనుండీ ప్రతిధ్వనిస్తూ నేల నాలుగు దిశలా ఉన్న మహిళలందరనూ వెన్నుతట్టి ఉత్తేజపరుస్తున్నట్లుగా ఉన్నాయి!

తార తన్మయురాలై వింటున్నాది!

ఆమె మనసు పరవశంతో నాట్యమాడుతోంది!

తన కడుపులోని బిడ్డ ఆడబిడ్డే అవ్వాలనీ, ఆ



## తార

బిడ్డ రేణూ చక్రవర్తి అంత గొప్పదవ్వాలనీ, తండ్రి వెంట ప్రతి మీటింగుకూ హాజరై, తండ్రితోపాటు తను కూడా ఉపన్యసిస్తూ తండ్రి పేరు నిలబెట్టాలనీ, అంతటి బిడ్డను కన్నందుకు తనెంతో మురిసి పోవాలనీ—

ఏవేవో కలలతో, ఊహలతో పరిసరాలనే మర్చి పోయేది

సరోజినీదేవిని గూర్చి వింది, ఆమెకు 'భారత కోకిల' అని బిరుదు ఉన్నాదని కూడా తారకు తెలుసు, అయితే - ఆమె ఉపన్యాసములు మాత్ర తార ఎపుడూ వినలేదు,

రేణూ చక్రవర్తి కంఠంలోని మాధుర్యాన్ని చవి చూస్తూ 'ఇదేనేమో కోకిల కంఠం అంటే' అని భావించేది!

తన కూతురు అంత గొప్పదవ్వాలని కోరుకునేది!

సభలకు రాక ముందు తన కడుపులోని బిడ్డ 'మగబిడ్డ' అవ్వాలని ఆశపడింది!

కానీ, ఇపుడు— మరో 'రేణు'కు తను మాతృ మూర్తి కావాలని ఉవ్విళ్ళూరుతున్నది!

ఈనాడు రేణూ చక్రవర్తికి ఎంతటి పేరు ప్రఖ్యాతులున్నాయో — మరో ఇరవయ్యేళ్ళనాటికి 'రేణూ వెంకట్' కూడా ప్రఖ్యాతిగాంచిన మహిళ అవ్వాలని ఆశపడుతున్నాది! కమ్మని కల కంటున్నాది!

* * *

ఆ రోజు ఆరోగ్యమయిన శిశువులలో పోటీ లాంటిది ఏర్పాటు చేసారు

విజయవాడకు చెందిన ఒక బేబీ ఆ బహుమతిని గెల్చుకుంది!

అది ముగిసిన వెంటనే ఒకటి — రెండు సంవత్సరాల మధ్య వయసు పిల్లలకు ఏర్పాటు చేసారు ఆ బహుమతిని స్వప్న కాజేసింది

ఆ సందర్భంగా స్వప్నను ఎత్తుకుని ముద్దు పెట్టుకుంటూ 'వెరీ స్వీట్ బేబీ' అంటూన్న రేణూ చక్రవర్తి విగ్రహం తార హృదయంలో చెరిగిపోని విధంగా ముద్ర వేసుకుంది

మరచిపోదామన్నా మరపుకు రాని సుందర దృశ్యం అది!

తార జీవితంలో అదొక సజీవ స్మృతి!

* * *

గుంటూరు నుండి తిరిగివచ్చేటపుడు వెంకటరత్నం విజయవాడలో ఏవో పుస్తకాలు కావాలని షాపులోనికి వెళ్ళాడు తార కూడా లోనికి వెళ్ళింది

వెంకటరత్నం పుస్తకాలు వెదుక్కుంటూంటే, తార చుట్టూ అరల్లో సర్ది ఉన్న పుస్తకాల వంక చూస్తున్నాది ఆమె కళ్ళు ఒకచోట రక్కున ఆగిపోయాయి! అది — 'డాక్టర్ అచ్చమాంబ' వ్రాసిన 'ప్రసూతి—శిశుపోషణ' అనే పుస్తకం!

అది తీసి, భర్తకు చూపించి కావాలని అడిగింది

చిన్నగా నవ్వాడు వెంకట్

గుడ్లవల్లేరు వచ్చాక వెంకటరత్నం కార్యక్రమాల్లో కొన్ని మార్పులు జరిగాయి! ఫలితంగా అతనికి ఎక్కడి సమయమూ చాలటంలేదు

"రోజుకు ముప్పైనాలుగు గంటలు ఉంటే బాగుండును" అన్నాడు వెంకట్

"అపుడుకూడా మీకు చాలదు" అన్నది తార నవ్వుతూ

"నిజమే!" వెంకట్ కూడా నవ్వాడు

ఉదయం కాకులు కూసేవేళ హడావుడిగ వెళ్ళిపోయే వెంకటరత్నం — ఇహ అర్ధరాత్రి దాటాక కుక్కలు మొరిగేటపుడు ఇంటికి వచ్చేవాడు ఎప్పుడయినా వీలయితే మధ్యాహ్నంపూట భోజనానికి వచ్చేవాడు! సెకుంటే లేదు!

ఒక్కోసారి తార చాలా ఒంటరితనం అనుభవించేది కాని, అంతలోనే అతని మహోన్నత భావాలు గుర్తుకొచ్చి మనస్సును సరిపెట్టుకునేది

గుడ్లవల్లేరు వచ్చి దాదాపు ఎనిమిది మాసాలు జరిగిపోయాయి ఇంతవరకూ అత్తవారింటి నుండి గానీ, పుట్టింటి నుండిగానీ ఎవరూ రాలేదు వెంకటేశ్వరావు ద్వారా కబుర్లు తెలుసుకోవటమే కానీ, తార కూడా నూజెల్లకు వెళ్ళలేదు

గిరిజకు ఆడపిల్ల పుట్టిందని వెంకటేశ్వరావు చెప్పగానే తార చాలా సంతోషించింది వెంటనే వెళ్తానని అన్నది కాని, వెంకటరత్నం ఒప్పుకోలేదు

"ఇపుడు — ఈ సమయంలో నువ్వు అక్కడకు వెళ్ళి ఆ చాకిరీ చెయ్యలేవు" అన్నాడు

"అదీ నిజమే" అన్నాడు వెంకటేశ్వరావు

నెలలోపు సత్యవతమ్మ చాలా ఘనంగా మనుమరాలికి ఉయ్యాల వేసింది తారకు కబురు చేయలేదు పురిటికి వస్తానని కూడా రాలేదని కోపం! అయినా "నా ఆడపడుచు వేడుకకు నాకు కబురు పంపేదేముంది! నేను వెళ్తాను" అంది తార

"ఇహ ఆ అవమానం కూడా చేయించుకోవాలని కోర్కెగా ఉన్నదా?" అని కోప్పడ్డాడు వెంకట్ అతని కిష్టంకాని పని చేయటం తార కెప్పుడూ అలవాటు లేదు

ఆ రోజు సాయంత్రం స్వప్నకు స్నానం చేయించి, జుట్టును రెండు భాగాలుగా చేసి, రిబ్బన్లతో కట్టింది ప్రక్క ఇంటివాళ్ళ అబ్బాయి అశోక్ వచ్చాడు

అతను ఎస్ ఎస్ ఎల్ సి చదువుతున్నాడు స్వప్న అంటే చాలా ఇష్టం! ప్రతిరోజూ సాయంత్రం పూట స్వప్న చేయి పట్టుకుని చెరువుగట్టు దాటి, అవతలివైపుకు షికారుగా వెళ్ళి వస్తుంటాడు! స్వప్న చెప్పే చిన్న చిన్న మాటలు అతనికెంతో ముద్దుగా ఉండేవి! అతన్ని "మామా" అని పిల్చేది!

అతను ఇంటికి రాగానే పరుగెత్తుకెళ్ళి అతని చేతులు పట్టుకుంది అశోక్ స్వప్నను ఎత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు తర్వాత క్రిందికి దించుతూ "అమ్మకు టా టా చెప్పు" అన్నాడు

వాళ్ళిద్దరూ బయటకు వెళ్ళగానే తార స్నానానికి వెళ్ళింది

స్నానం చేసి వచ్చేసరికి బయట ఎవరివో మాటలు వినిపిస్తున్నాయి తలుపులు తీసి, ఆశ్చర్య పోయింది తార

బయట — చంద్రం నిలబడి ఉన్నాడు ఎంతో సంబరంగా లోనికి ఆహ్వానించింది అప్పటికప్పుడ

వేలాది కుటుంబాలు అనాదిగా వాడబడుతున్న
లవంగనూనె ప్రభావాలన్నింటినీ ప్రామిస్‌లో మళ్ళీచూసారు.

# లవంగనూనెతో కూడిన సాటిలేని టూత్‌పేస్ట్ ప్రామిస్

మీరూ ఎందుకు వాడి చూడకూడదు మరి!




## ప్రామిస్

దంతక్షయంనుండి రక్షణకు
తోడ్పడుతుంది. నోటినితాజాగా
రూపొందించి
దుర్వాసనను అరికడుతుంది




3 బల్సారా ఉత్పాదన

ఆరోగ్యంచిందే పళ్ళు,
చిగుళ్ళు, తాజాశ్వాస–
అదే మరి ప్రామిస్ వాగ్దానం.

CHAITRA BLS-453 TEL

ఉప్మా చేసి తమ్ముడికి పెట్టింది అదే కుంపటిమీ వంట చేస్తూ తమ్ముడు చెప్పే కబుర్లు వింటోంది

చంద్రం ఇంటర్ మొదటి సంవత్సరం చదువుతున్నాడు మోహన్ బి ఎస్ సి లో చేరాడు రామారావు బి ఏ అవ్వంగానే బి ఇడి ట్రైనింగుకు వెళ్ళాడు అతనికి పెళ్ళి కుదిరిందిట వచ్చే నెల పదిహేనో తారీఖున లగ్నం అట అందువల్ల తారను తీసుకురమ్మని చంద్రాన్ని పంపించారు

తారకు ఆ కబుర్లు వింటుంటే "ఏమిటో! పరాయి యింటి కబుర్లు వింటూన్నట్లుగా ఉంది!" అనుకుంది

"సరళ కబుర్లు తెలుస్తున్నాయా?"

"ఊఁ— లెటర్సు వ్రాస్తూనే ఉంటుంది బాగానే ఉన్నారుట బావగారి పని ఫర్వాలేదనుకుంటాను అవునూ స్వప్న ఏది?" అపుడే గబుక్కున గుర్తొచ్చిన వాడిలా అడిగాడు

నవ్వింది తార "ఇపుడే బయటకు షికారు వెళ్ళింది వచ్చేస్తుందిలే"

దీపాలు వెలిగించింది

"అమ్మ ఆరోగ్యం బాగుందా?"

"ఊఁ— ఫర్వాలేదు"

"నాన్నగారు బాగున్నారా? రామంకు కుదిర్చిన అమ్మాయిని నువ్వు చూసావా? బాగుందా ఏ ఊరు? పెళ్ళి ఎక్కడ?" అనేక ప్రశ్నలు వేసి జవాబులు వింటోంది

"అక్కా! బావగారు ఎపుడొస్తారు?"

"ఈ ప్రశ్నకు జవాబు బావగారికే తెలీదురా!"

వంట పూర్తిచేసింది

అక్క పని అయిపోవటం గమనించిన చంద్రం అన్నాడు— "అక్కా! ఆ సంచీలో అమ్మ ఏవేవో పెట్టి ఇచ్చింది తీసి సర్దుకో"

"ఇంత పెద్ద కాన్ నిండా ఏంపెట్టి ఇచ్చిందిరా?"

చంద్రం చిన్నగా శబ్దం చేస్తూ నవ్వాడు

"అమ్మ నిజంగా పిచ్చిదక్కా! ఎవరు దూరంగా ఉంటే వాళ్ళమీద అమ్మకు ప్రేమ ఎక్కువగా ఉంటుందక్కా సరళక్క చాలా దూరం వెళ్ళిపోయిందా! అన్నయ్యేమో రాజమండ్రిలో ఉన్నాడా! నువ్వు ఇక్కడ! ఇహ ఇంట్లో ఉండేది నేనూ, మోహన్ ఇద్దరమే కదా! అమ్మ ధ్యాస మా ఇద్దరి మీదా ఉండనే ఉండదు ఎంతసేపూ మిమ్మల్ని గురించే ఆమె ఆలోచనంతానూ"

పకపకా నవ్వింది తార

"అందుకని ఇన్ని రకాలుచేసి పంపిందా?"

"అన్నీ అమ్మ చెయ్యలేదులే మొన్న జయక్క వచ్చింది ఆమె తెచ్చింది కొన్ని అమ్మ చేసింది పైగా నీకింకో విషయం చెప్పలేదు రేపు సాయంత్రం మోహన్ కూడా వస్తున్నాడు అందుకని అన్నీ ఇక్కడికే ఇచ్చేసింది"

వింటూన్న తారకు చాలా ఆనందం కలిగింది, ఇన్నాళ్ళకు తన అనుకునేవాళ్ళు తమ ఇల్లు వెదుక్కుంటూ వచ్చినందుకు

మూత తెరవంగానే పైన నువ్వు పూర్ణాలు

ఉన్నాయి! "మీ బావగారి కిష్టమని చేసిచ్చిందా అమ్మ ?"

నవ్వాడు చంద్రం "అడుగున నీ కిష్టమైనవి కూడా ఉన్నాయిలే తీసిచూడు!"

ఒకటి తీసి తమ్ముడికిచ్చి, తనొకటి కొరుకుతూ అన్నది – "ఉండనియ్యరా! ఇవన్నీ పెట్టుకుందుకు మా యింట్లో డబ్బాలేమీ లేవు తెప్పించాక సర్దుతానులే!"

"ఆ సంచీలో నీ కిష్టమయిన జామకాయలు ఉన్నాయక్కా!"

చంద్రం అలా చెబుతూంటే తారకు కళ్ళల్లోకి నీళ్ళు చిప్పిల్లాయి 'రక్తసంబంధానికున్న విలువ నిజంగా, మరి దేనికీ ఉండదు!' అన్పించింది

స్వప్న చేయి ఎట్టుకుని అశోక్ లోపలకు వచ్చాడు

"రా అశోక్ రా!" చిన్న స్టూలను ముందుకు జరుపుతూ పిల్చింది

చంద్రం వంక కుతూహలంగా చూస్తూ వచ్చి కూర్చున్నాడు అశోక్

పెద్ద పెద్ద కళ్ళతో ఆశ్చర్యంగా తనవంకే చూస్తున్న స్వప్నవైపు రెండు చేతులూ చాస్తూ "స్వప్నా!" పిల్చాడు చంద్రం

సిగ్గుగా తల్లి దగ్గరకు వచ్చింది స్వప్న

"స్వప్నా! అతను మామ తల్లీ, వెళ్ళు" చెప్పింది "అశోక్! ఇతను మా చిన్నతమ్ముడు చంద్రం గుడివాడ కాలేజీలో ఇంటర్ మొదటి సంవత్సరం చదువుతున్నాడు రేపు సాయంత్రం ఇంకో తమ్ముడు వస్తున్నాడు వాడి పేరు మోహన్" సంతోషంగా చెప్పింది

ఒక ప్లేటు తెచ్చి దాని నిండా తల్లి పంపిన ఫలహారాలు పెట్టి అతని ముందర పెట్టింది

"వద్దక్కా, ఇవి తింటే అన్నం తినలేను అన్నం తినకపోతే అమ్మ తిడుతుంది!"

నవ్వింది తార

"ఈ ఒక్కరోజూ నాకోసం తిట్లు తిను ఫర్వాలేదులే" అశోక్‌తోపాటు చంద్రం కూడా నవ్వాడు

"ఒరేయ్ చంద్రం! ఇతను అశోక్! 'మీకు నేను దూరంగా ఉన్నాను' అనే దిగులు లేకుండా నాకు తమ్ముడులాగే ఉంటున్నాడు ఎస్.ఎస్.ఎల్.సి చదువుతున్నాడు ఇహ స్వప్నకయితే మామయ్యేగాక మంచి ఫ్రెండు కూడానూ"

"నాకు రేపట్నుండీ సెలవలు ఈ సెలవలకు బోర్ కొట్టకుండా మీరు రావటం చాలా సంతోషం!" అన్నాడు అశోక్ చంద్రంతో.

ఆశ్చర్యపోయాడు చంద్రం

"మీ అంత బాగా మాట్లాడటం నాకు రాదు"

నవ్వాడు అశోక్ "ఇదంతా నాకు అక్క నేర్పించిన విద్య"

మరి కొంచెంసేపు కబుర్లు చెప్పుకున్నాక స్వప్నతో ముద్దు పెట్టించుకుని, చంద్రానికి గుడ్ నైట్ చెప్పి వెళ్ళిపోయాడు అశోక్

స్వప్నకూ, చంద్రానికీ భోజనాలు పెట్టింది తార

తర్వాత ఆరు బయట మంచం వేయబోతూన్న అక్కను వారించాడు చంద్రం "అరె! నువ్వెందు కేస్తాను! ఆ మంచం నువ్వెత్తటమేమిటి! నేనున్నాను కదా!" మంచం తెచ్చి బయటవేసాడు

మరి కాసేపటికి స్వప్న చంద్రం దగ్గర నిద్రపోయింది

వెంకట్ ఇంటికి వచ్చాడు - రాంగానే క్రీనీడలో కూర్చుని ఉన్న చంద్రాన్ని గుర్తుపట్టలేకపోయాడు తార లేచి నిలబడింది చంద్రం కూడా లేచాడు స్వప్నను వెంకటరత్నం చేతులమీదుకి ఎత్తిపట్టుకుని "భోజనం చేసావామ్మా?" అని అడుగుతున్నాడు

"ఇతనెవరో గుర్తుపట్టగలరేమో చూడండి!" అంది తార

నవ్వుతూన్న చంద్రాన్ని చూసి ఎంత ఆలోచించినా అతనెవరో గుర్తుకురాలేదు, వెంకట్‌కు అతన్ని పెళ్ళిలో చూడ్డమే! తర్వాత మళ్ళీ చూడనేలేదు

"చిన్నతమ్ముడు – చంద్రం" తానే చెప్పింది

"అరే! చంద్రమూ! ఎంత పెద్దవాడయ్యాడు! ఎప్పుడొచ్చావోయ్! అమ్మా, నాన్నా బాగున్నారా?" ఎంతో ఆప్యాయంగా కుడిచేయి చాచి అతని నడుం చుట్టూ వేసి అడిగాడు వెంకట్

బావగారు అలా దగ్గరకు తీసుకునేసరికి చంద్రం కాస్త సిగ్గుపడ్డాడు

"కూర్చో" మంచంమీద కూర్చుంటూ చెప్పాడు

"లేచి స్నానం చేసిరండి, భోజనం చేస్తూ కబుర్లు చెప్పుకోవచ్చు"

"అవునవును," అంటూ నవ్వి స్వప్నను మంచంమీదకు దించి లోపలకు వెళ్ళిపోయాడు

భోజనం చేయగానే వెంకటరత్నం కోసం మనుషులొచ్చారు వాళ్ళతో ఇవ్వాళ్టికి తను రాననీ చెబుతూ, వాళ్ళు చేయవలసిన పనులేమిటో వివరించి పంపించేసాడు, వెంకట్

మనసారా నవ్వుతూ అంది తార –

"ఇన్ని సంవత్సరాలలోనూ ఇంట్లో వాళ్ళ కోసం మీ పనులు మానటం ఇదే మొదటిసారి! అదికూడా చంద్రాన్ని గూర్చి మీరింట్లో ఉండటం ఎంతో ఆశ్చర్యం!"

"నీ మొహం!"

వెంకట్ చంద్రాన్ని తరచి తరచి ఎన్నో విషయాలు అడిగి మరీ చెప్పించుకుంటున్నాడు

"మోహన్‌ని కూడా ఇవ్వాళే తీసుకు రావలసింది"

"రేపు కూడా ఎగ్జామ్స్ ఉంది బావా"

తార ప్లేటులో నువ్వు పూర్ణాలు పెట్టి తెచ్చింది

"ఇపుడా?"

"ఫర్వాలేదు తినండి ఏదో ఇవ్వాళ చంద్రం పుణ్యమా అంటూ ఇంతసేపు మాతో ఉన్నారు మళ్ళీ మీకు తినటానికి తీరికే ఉండదు మీ కిష్టమైనవి మీకు పెట్టకుండా తినటానికి మాకూ మనసురాదు"

"ఈ ఆరోపణ మరీ బాగుంది!" తను తింటూ చంద్రానికి అందించాడు

"చాలా బాగున్నాయి!"

"రేపు ధర్మారావుగారి షాపునుండి రెండు మూడు ఖాళీ డబ్బాలుంటే తెచ్చిపెట్టండి"

"చూడూ! ఇలాంటివి నాతో చెబితే నేను తప్పకుండా మర్చిపోతాను అశోక్‌తో చెప్పి తెప్పించుకో! లేకపోతే రేపు మధ్యాహ్నం వెంకటేశ్వరరావు వస్తాడు వాడితో తెప్పించుకో" అన్నాడు

* * *






తార పుట్టింటికి వెళ్ళి, మళ్ళీ వెంటనే గుడ్లవల్లేరు రాలేకపోయింది.

రామారావు పెళ్ళి అయిన వెంటనే వెళ్ళిపోతానని అన్నది. కాని, నాగరత్నమ్మ అనారోగ్యంవల్ల ఆగిపోవలసి వచ్చింది. తీరా ఆవిడ కోలుకునేసరికి రామారావు భార్యను నెలలోపున అత్తవారింటికి తీసుకురావాలి అన్నారు. అవన్నీ ముగిసేసరికి "ప్రసవ దినాలు దగ్గర పడుతున్నాయి కదా ఇంక ఇపుడెందు కమ్మా వెళ్ళటం" అన్నారు రఘవయ్యగారు.

ఆ విధంగా తార గుడివాడలోనే ఉండిపోవలసి వచ్చింది.

తారకు ఆడపిల్ల పుట్టింది.

వెంకటరత్నం వచ్చాడు.

"మరలా పాపే పుట్టిందని బాధపడు తున్నావా ?"

తార పుట్టింటికి రాగానే అతను ఇంకపైన పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకున్నాడు. ఆ రోజుల్లో అదే క్రొత్త ! ఎవరైనా ఆపరేషను చేయించుకున్నారు అంటే 'చెడిపోయినవాళ్ళను' చూసినట్లుగా చూసేవారు. వాళ్ళేదో మహా పాపం చేసినట్లుగానూ, గొప్ప నేరస్థుల్లాగానూ భావించేవారు. అలాటివాటిని లెక్క చెయ్యకుండా గొప్ప ధైర్యంతోనే ఈ పని చేసాడు వెంకటరత్నం. అయితే ఆ విషయం తారతో సంప్రదించటానికి సమయం లేకపోవుటవలన ఉత్తరంలో వివరంగా

## తార

వ్రాసాడు. అందుకే అలా అడిగాడు.

"ఉహూ—అదేం లేదు. ఎవరయినా ఒకటే!" నవ్వింది.

"గుడ్ ! అలాగుండాలి."

'ఎక్కడ ఏడ్చి మొత్తుకుంటుందో ! ఎలా ఆమెని ఓదార్చాలో' అంటూ ఆలోచించిన వెంకట్ తార జవాబుకు తేలికయిన మనస్సుతో మధురంగా నవ్వుడూ బుగ్గపైన సున్నితంగా చిటికె వేసాడు.

స్వప్నతో కాసేపు ఆటలాడి, బావమరదులతో కొంచెంసేపు కబుర్లుచెప్పి, మామగారితో మాటలాడి వెళ్ళిపోయాడు.

అతను వెళ్తూ వెళ్తూ లోనికి వచ్చినపుడు తార మెత్తగా నవ్వింది.

"దీనిపేరు రేణుక పెడదాము. బాగుందా ?"

"ఊఁ — ఊఁ — బ్రహ్మాండంగా ఉంది" కళ్ళెగరేస్తూ నవ్వాడు.

"ఆరోగ్యం జాగ్రత్త ! అపుడపుడూ వస్తూండండి. ఈసారి మూడవనెల రాగానే వచ్చేస్తాను."

"అలాగే."

"ఉత్తరాలు వ్రాస్తూండండి."

"అలాగే."

"అశోక్‌తో చెప్పండి, స్వప్నకు చెల్లాయి పుట్టిందని."

"అలాగే."

"వెంకటేశ్వరరావుని అత్తగారితో చెప్పమనండి."

"అలాగే."

"మీకు 'అలాగే' అంటం తప్ప ఇంకేమీ రాదా ?" చిరుకోపంగా అడిగింది.

గుప్పిళ్ళు బిగించి గాలితో యుద్ధం చేస్తూన్న రేణువంకే చూస్తూన్న వెంకటరత్నం ఫక్కున నవ్వాడు.

"మరేం చేయను. నువ్వేదో అవన్నీ చాలా అవసరమైన పనుల్లాగా చెబుతుంటే 'నేను చేయను' అంటే ఎలాగూ ! అందుకే 'సరేలే' అని చెప్పాను. అదీ తప్పేనా ?"

బుంగమూతి పెట్టుకుని, వచ్చే నవ్వుని బలవంతంగా ఆపుకుని మెరిసే కళ్ళతో తనవంకే చూస్తున్న తారను అభిమానంగా చూసాడు వెంకట్. ఒకసారి వెనక్కు తిరిగి గుమ్మం వంక చూసి, చటుక్కున ముందుకు వంగి తారను ముద్దు పెట్టుకున్నాడు.

"ఏమిటీ పని ?" చిరుకోపంగా అడిగింది.

"నాదేం తప్పు లేదు. నీ కళ్ళూ, నీ పెదాలూ 'ఒక్క ముద్దివ్వు' అని బ్రతిమాలుతుంటే ఆ పని చేసాను. సరే, వస్తానూ !" నవ్వుతూ వెళ్ళిపోయాడు.

(ఇంకా వుంది)



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## "చిలిపి జోస్యం"

"హాస్య భరిత చిత్రం,' అన్నారు ఆదిశక్తి చిత్రవారి పై చిత్రానికి తొలిసారిగా దర్శకత్వం నెరిపే ఎం పార్థసారథి ఈయన లోగడ కె హేమాంబరధరరావు ప్రభృతుల వద్ద శిష్యరికం చేశారు ఈ చిత్రానికి జనవరి 20 న తొలి గీతం రికార్డయింది చంద్రమోహన్, రాధిక, సత్యనారాయణ గిరిబాబు, నాగభూషణం అల్లు

## రాజాచంద్ర — శోభన్‌బాబు

'ఇద్దరు ప్రముఖ హీరోయిన్‌లుంటారు వాళ్ళెవరో త్వరలో నిర్ణయిస్తాం,'' అన్నారు రాజాచంద్ర ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో ఎ లక్ష్మీనారాయణ సమర్పించే చిత్రంలో శోభన్‌బాబు హీరో సత్యం సంగీతం, రంగా ఛాయ, వేణుగోపాల్ కూర్పుతో అమర్‌నాథ్ నిర్వహణ బాధ్యతలు వహించే ఈ చిత్రానికి ఎ సత్యనారాయణ ఎర్మాత



'రాధమ్మ మొగుడు'లో చంద్రమోహన్

## దర్శకుడైన నిర్మాత

"మా చిత్రంలో ఆర్టిస్టుల చాలావరకు కొత్త వాళ్ళే' అన్నారు నటనాలయ కంబైన్స్ ద్వితీయ చిత్రానికి తొలిసారిగా దర్శకత్వం వహించే కోనేరు రవీంద్రనాథ్ ఈయన చిత్ర నిర్మాత అవడానికి ముందు వి మధుసూదనరావు ప్రభృతుల వద్ద దర్శక శాఖలోనూ అనుభవం గడించారు 'ముద్ద మందారం'' అనంతరం నటనాలయ కంబైన్స్ నిర్మించే కొత్త చిత్రానికి ఇటీవల రమేష్‌నాయుడు స్వరకల్పనలో కొన్నిగీతాలు రికార్డ్ చేశారు ఫిబ్రవరి 15 నుంచి షూటింగ్ ఉంటుంది

'కోరుకున్న మొగుడు'లో



శోభన్‌బాబు, రూపాచక్రవర్తి

రామలింగయ్య, సత్యకళ, నిర్మల వగైరా తారా సందోహం డి వి నరసరాజు రచయిత కె వి మహదేవన్ స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు ఎర్ రఘునాథరెడ్డి ఛాయ, శ్రీనివాసరావు శిల్పం, నాయని మహేశ్వరరావు కూర్పు గమిడి కనకేశ్వరరావు సహకార దర్శకత్వం, టి ఎస్ రాజు నిర్వహణలో బాలు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ ''జనవరి 27 నుంచి ఫిబ్రవరి 5 వరకు మొదటి షెడ్యూల్ మార్చి 5 నుంచి 25 వరకు రెండవ షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది,'' అన్నారు నిర్మాత ' అమరనాథ్

## పి. సి రెడ్డి దర్శకత్వంలో "జగ్గు"గా కృష్ణంరాజు

"రెండవ షెడ్యూల్ జనవరి 27న మదుమలై ఫారెస్ట్‌లో ప్రారంభమవుతుంది ఆ తర్వాత ఫిబ్రవరి 6 వరకు మైసూరు లలిత మహల్ పేలెస్‌లో షూటింగ్ ఉంటుంది దాంతో సగం చిత్రం పూర్తవుతుంది,' అన్నారు కె ఎ శేఖర్‌బాబు ఈయన నిర్మించే దేవీ కమల్ మూవీస్ జగ్గు చిత్రంలో కృష్ణంరాజు, జయసుధ, సత్యనారాయణ గిరిబాబు, అల్లు రామలింగయ్య సారధి భీమరాజు ఆనందమోహన్, గీత నటిస్తున్నారు సత్యానంద్ చక్రవర్తి, ఎస్ గోపాలరెడ్డి, నాయని మహేశ్వరరావు శరత్, గోపాల్, మల్లి సాంకేతిక బృందంతో ఎ చంద్రశేఖరరెడ్డి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు

'మల్లెపందిరి'లో ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం





దొంగలొస్తున్నారు జాగ్రత్త లో కె ఆర్ విజయ

## కృష్ణార్జునులలో కృష్ణార్జున సంవాదం

కృష్ణ(శోభన్‌బాబు)ని చూసి అర్జున్(కృష్ణ) కృష్ణా, ఇక్కడ నిలబడ్డావేంట్రా ?'' అన్నాడు

'నిన్న నువ్వు తీసుకొచ్చిన కేరేజీ ఎక్కడిది అన్నా! నిజం చెప్పు వెంకట్రామయ్యగారి భార్య ఇచ్చిందేనా ? కృష్ణ గద్దించాడు

ఆకలికి తట్టుకోలేక '

''ఈవాళ ఆకలికి తట్టుకోలేక అబద్ధం చెప్పావ్ రేపు ఆలవాట్లను మార్చుకోలేక ఏమైనా చేస్తావ్

బాబులీగాడి దెబ్బ'లో ప్రభాకరరెడ్డి శ్రీదేవి



సారీ, అర్జున్! గాలికెగిరే గాలిపటాన్ని చెట్టుకు కట్టేస్తే ఆగిపోతుందనుకోవటం నీ తెలివి తక్కువతనం దారన్ని తెంచుకున్నా సరే – అది పైకి వెళ్లిపోతుంది దానంతటది ఏ చెట్టుకైనా తగులుకున్నైనా ఆగాలి లేదా గాలి ఉధృతానికి తట్టుకోలేక చిరిగైనా క్రింద పడిపోతుంది ఏ అనుభవమైతే నీకే జీవితాన్ని నేర్పిందో – ఆ అనుభవమే ఎదురుతిరిగి నీకు ఎదురుపాఠం నేర్పితే తప్ప, నువ్వు మారవు నిన్ను మార్చాలనుకోవడం, మారితే కలిసి నీతో బ్రతకాలనుకోడం – నా అవివేకం వెరీ సారీ!''

''ఆగు! నువ్వు చెప్పినట్టు నాలుగు రోజులు తిరిగాం తీవ్రంగా ప్రయత్నించాం ఉద్యోగం దొరికిందా ? కనీసం దొరుకుతుందన్న ఆశన్నా కల్గిందా ?''

''అర్జున్! దేవుడున్నాడు అనుకున్నవాడికి రాయిలో కూడా దేవుడు కనిపిస్తాడు దేవుడే లేడనుకునేవాడికి దేవుడు కూడా రాయిలాగే కనిపిస్తాడు నేను నీతో వాదించలేను వస్తాను

''దిస్ ఈస్ కాల్డ్ ఎస్కేపిజమ్ - తప్పించుకు పారిపోవడం!''

'ఎస్ యు ఆర్ రైట్! ఐ యామ్ ఎన్ ఎస్కేపిస్ట్ నేను తప్పించుకు పారిపోయే మనిషిని నీతి, ధర్మం ఎక్కడ ఉండవో – అక్కడ్నుంచి నేనెప్పుడూ తప్పించుకుంటాను

''నీ నీతి కోసం పస్తులుండి చావలేరుగా ?'

''అవసరమైతే చావాలి తప్పదు ''

''ఓకే చస్తాను కాని, నీ నీతి కోసం కాదు నీ ధర్మం కోసం కాదు నీ కోసం నీ నీతిమీద, నీ ధర్మంమీద నాకు నమ్మకం లేదు నీ మీద నాకుంది కాని, కృష్ణా! నీతికి–అవినీతికి, ధర్మానికి–అధర్మానికి మధ్య సృష్టి పుట్టినప్పట్నుంచీ పోరాటం జరుగుతూనే ఉంది చివరికి అవినీతి నెగ్గుతుందని నా నమ్మకం. నీతి నెగ్గుతుందని నీ నమ్మకం దానికీ ఒక గడువుకావాలి ఈ రోజు నుంచి తిన్నా తినకపోయినా, పస్తులుండైనా సరే – పదిహేను రోజులు ప్రయత్నిద్దాం ఫలితం దొరక్కపోతే ?

''మనమ్ము పెట్టి ప్రయత్నిస్తే పదిహేను రోజులక్కర్లేదు పదిరోజులు చాలు ఏదో ఒక ఉద్యోగం దొరుకుతుంది'

''ఓ–కే ఓ–కే నీ నమ్మకం నీకుంది పదిహేనురోజులూ నువ్వు చెప్పినట్టు నీతోనే ఉంటాను నువ్వు చెప్పిందల్లా చేస్తాను ఆ పదిహేనురోజుల్లోను ఉద్యోగం దొరికితే నీ దారికి నేను వస్తాను దొరక్కపోతే నువ్వు నా దారికి రావాలి దొంగతనాలు చెయ్యాలి దోపిడీలు చెయ్యాలి నేను చెప్పినట్లల్లా వినాలి ఓ–కే?

''ఓ – కే డన్

వగబట్టిన సింహం లో



జయప్రద, కృష్ణ

దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో జయకృష్ణ నిర్మించే 'కృష్ణార్జునులు'' చిత్రంలో శ్రీదేవి జయప్రద నాయికలు

## చైతన్య చిత్ర సమర్పణలో సుచిత్ర ఇంటర్నేషనల్‌వారి చిత్రం

''మా భూమి'' చిత్ర నిర్మాత బి నరసింగరావు స్వీయ దర్శకత్వంలో ఒక చిత్రకారుడి జీవితాన్ని తెరకెక్కించదలిచారు. ఈ చిత్రానికి కథకుడూ, కథనాయకుడూ కూడా ఈయనే నారాయణరావు, సాయిచంద్, చిత్రకారుడు చంద్ర, వెంకటరెడ్డి ఇతర పాత్రధారులు మార్చి నుంచి షూటింగ్ ఉంటుంది

# విదేశీ చిత్ర వార్తలు!

★ 'బోనీ అండ్ క్లైడ్' ఆంగ్ల చిత్రంలో అద్భుతంగా నటించిన ఫేడన్వే అనే తార ఒక వాణిజ్య ప్రకటన తాలూకు హ్రస్వ చిత్రంలో ఆరు పదాలు మాట్లాడినందుకు 5 లక్షల పౌండ్లు స్వీకరించిందట అంటే, 90 లక్షల రూపాయలు ఒక పదానికి 15 లక్షలా!

★ కొన్ని ఆంగ్ల చిత్రాల్లో కూడా నటించిన సుప్రసిద్ధ గ్రీక్ నటీమణి మెలీనా మెర్‌కౌరి అక్టోబర్ 21న ఏథెన్స్‌లో ఏర్పడిన నూతన గ్రీక్ మంత్రివర్గంలో సాంస్కృతిక, శాస్త్రవిజ్ఞాన విభాగాల మంత్రిణిగా నియమింపబడింది

★ మనదేశంలో తొలి సినిమాస్కోప్ చిత్రం 'ది రోబ్' (1954)ను, తొలి 70 ఎం.ఎం. చిత్రం 'కింగ్ సోలమన్ అండ్ షీబా''ను విడుదల చేసిన ఘనత ట్వెంటీయత్ సెంచరీ ఫాక్స్ వారిది ఇప్పుడీ సంస్థ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌గా మాజీ అమెరికా అధ్యక్షుడు మిస్టర్ జి ఫోర్డ్, మాజీ సంయుక్త రాష్ట్రాల కార్యదర్శి మిస్టర్ హెన్రీ కిస్సింజర్‌లు నియుక్తులయ్యారు

'కృష్ణార్జునులు'లో కృష్ణ, శోభన్‌బాబు



'ధర్మవడ్డీ'లో ప్రభ

# సినిమా

## కట్టా దర్శకత్వంలో ఎన్ టి ఆర్, కృష్ణ

మన రాష్ట్రం నుంచి వచ్చిన వేలాది ఎన్ టి ఆర్, కృష్ణ అభిమానులతో జనవరి 22న ఎ వి ఎం స్టూడియోలోని ఫస్ట్ ఫ్లోర్ క్రిక్కిరిసిపోయింది 'దేవుడు చేసిన మనుషులు' అనంతరం ఎన్ టి ఆర్, కృష్ణ కలిసి నటించే చిత్రం జి ఆర్ కె ఆర్ట్స్ ''వయ్యారి భామలు వగలమారి భర్తలు'' ఆర్ వి గురుపాదం నిర్మించే ఈ చిత్రం ప్రారంభోత్సవం భారీ ఎత్తున జరిగింది మన రాష్ట్ర సినిమాటోగ్రఫీ శాఖామాత్యులు శ్రీ ఎన్ చంద్రబాబునాయుడు కెమెరాకు చలనం కలిగించారు స్పోర్ట్స్ కౌన్సిల్ అధ్యక్షులు శ్రీ ఎస్ ఇంద్రసేనరెడ్డి తొలి క్లాప్ కొట్టారు శ్రీదేవి, రాధిక, రమాప్రభ, పండరీబాయి ఎస్ వరలక్ష్మి, రావు గోపాలరావు, నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, భానోజీ పాత్రధారులు డి వి నరసరాజు రచయిత వేటూరి గీతాలకు రాజన్ నాగేంద్ర స్వరకల్పన చేశారు ఎ ఎస్ ప్రకాష్ ఛాయ, గౌతమ్‌రాజు కూర్పు మోహన్ రాజేంద్ర శిల్పంతో ఆర్ వి నరసింహారెడ్డి సహ నిర్మాత సమర్పణ ఆర్ వి కమల

# తారల హారాలు

## శరత్‌బాబు

'నాకే దురభ్యాసమూ లేదు వ్యసనమంటే ఏమిటో ఎరుగను నా కసలు పేకాట కూడా తెలీదంటే నమ్ముతారా ?'' అంటూ శరత్‌బాబు తన మెడకున్న బంగారు గొలుసులోని ఓ పతకాన్ని తీసి చూపించారు. అందులో ''ఓం' అని ఉంది ''నేను సదా సన్మార్గంలో ఉండానికి కారణం ఇదే,'' అన్నారాయన

## రాధిక

'నా మెడలో ఈ గొలుసు లేకుండా నేనే చిత్రంలోనూ నటించను నా పుట్టినరోజు పండుగనాడు మా మామయ్య దీనిని కానుకగా ఇచ్చారు ఈ లాకెట్‌లో పాత సిలోన్ నాణెం ఉంది జార్జ్ రాజు బొమ్మ చూడండి ఇది నాకు చాలా లక్కీ లాకెట్ అందుచేత ఎప్పుడూ ధరిస్తూంటాను,'' అంది రాధిక ఆ బంగారు గొలుసును చూపిస్తూ

యమున



''ఒక టికెట్టు ధర్మం చెయ్ బాబూ!''

## శ్రీకర్ ప్రొడక్షన్స్ ద్వితీయ చిత్రం

'మా రెండవ చిత్రంలో కూడా చిరంజీవి హీరో మా మొదటి చిత్రం 'చట్టానికి కళ్ళులేవు'లో పనిచేసిన డైరెక్టర్ ఎస్ ఏ చంద్రశేఖర్, కెమెరామన్ డి డి ప్రసాద్, మ్యూజిక్ డైరెక్టర్స్ కృష్ణ - చక్ర, ఆర్ట్ డైరెక్టర్ సాయికుమార్, ఎడిటర్ గౌతమ్‌రాజు, స్క్రిప్ట్ రైటర్ మైలవరపు గోపి - ఈ కొత్త చిత్రానికీ పని చేస్తారు,'' అన్నారు నిర్మాత వంకినేని సత్యనారాయణ అట్లూరి పూర్ణచంద్రరావు సమర్పించే ఈ చిత్రం తొలి షెడ్యూల్ జూన్ 1 నుంచి 15 వరకు, రెండవ షెడ్యూల్ జూలై 1నుంచి15వరకు జరుగుతాయి

## మద్రాసులో ఆంధ్ర సోషల్ అండ్ కల్చరల్ సంఘం ఆడిటోరియం

మద్రాసులో తరచు సాహితీ సాంస్కృతిక కార్యక్రమాలను విశిష్టమైన రీతిలో నిర్వహించే ఈ సంఘంవారు సంక్రాంతి సందర్భంగా ఒక వినూత్న కార్యక్రమాన్ని ఏర్పాటు చేసి, ఈ సంఘంలోని శాశ్వత సభ్యులను ఘనంగా సన్మానించారు నిరుడు రాష్ట్రపతి శ్రీ ఎన్ సంజీవరెడ్డి శంకుస్థాపన చేసిన ఆడిటోరియం నిర్మాణం ఈ ఏడు ప్రారంభమై 1983 ఉగాదికి పూర్తవుతుందని సంఘం అధ్యక్షుడు శ్రీ డి రామానాయుడు తెలియజేశారు ఈ ఆడిటోరియంకు అనుబంధంగా థియేటర్, కల్యాణ మండపం, స్విమ్మింగ్‌పూల్, అతిథి గృహాలు ఆధునిక రీతుల్లో రూపొందుతాయని శ్రీ ఎం ఎస్ రెడ్డి, శ్రీ గుమ్మడి ప్రభృతులు తెలియజేశారు మద్రాసులో తెలుగువారికి ఎంతో ఉపయోగపడే ఈ ఆడిటోరియం నిర్మాణానికి దాతలు భారీ విరాళాలను అందిస్తారని తాము ఆశిస్తున్నట్లు వారు చెప్పారు



కళాసాగర్ [సుదరాము]వారి సన్మానాన్ని దర్శక నిర్మాత శ్రీ పి పుల్లయ్య ద్వారా అందుకుంటున్న శతచిత్ర నటుడు మురళీమోహన్ ఊర్వశి శారద, నటి జయచిత్ర లవి కూడ చిత్రంలో చూడవచ్చు

## సినిమా

### డైరెక్టర్ కమలాకర కామేశ్వరరావు చిత్రాలు

మార్చి రెండవ వారంలో సెట్స్‌కు వెళ్లే సంతోషి మాత వ్రత మహాత్మ్యం"లో చంద్రమోహన్ శ్రీధర్, సత్యనారాయణ, ప్రభ, కె ఆర్ విజయ ఆదిగా గలవారుంటారు భారవి రచన కె వి మహదేవన్ సంగీతం, యోగానంద్ ఛాయ, వాలి శిల్పం, తాండవకృష్ణ నిర్మాణ సారధ్యంతో కె రాజయ్య నిర్మాత జయలక్ష్మి ఆర్ట్ ఇంటర్నేషనల్‌వారి చిత్రమిది

మార్చిలోనే మొదలయ్యే వనమాలి పిక్చర్స్ శ్రీరంగనాధ వైభవం"ను ఎన్ ఎస్ స్వామి నిర్మిస్తారు భారవి, ఎస్ రాజేశ్వరరావు, రామచంద్రన్ వారి వగైరా సాంకేతిక బృందం

ఏప్రిల్‌లో ప్రారంభమయ్యే రాజేశ్వర్ ఆర్ట్ ఎంటర్‌ప్రైసెస్‌వారి "మహిషాసుర మర్దని"లో మహిషాసురుడుగా సత్యనారాయణ చాముండేశ్వరిగా కె ఆర్ విజయ నటిస్తారు సముద్రాల రచన, పెండ్యాల సంగీతం, వాలి శిల్పంతో హరగోపాల్, సుబ్బారావు నిర్మాతలు

ఇవికాక కన్నడంలో 'శ్రీకృష్ణలీల' చిత్రానికి కూడా కమలాకర కామేశ్వరరావు దర్శకత్వం వహించబోతున్నారు 

ముసలోడికి దసరా పండుగ షూటింగ్‌లో నటి మేనకకి సూచనలిస్తున్న దర్శకుడు ముత్తురామన్



ఏలూరి దుర్గాప్రసాద్ సమర్పించు

అభినయ ఆర్ట్స్ క్రియేషన్స్

THARAKAPRABHU ADS

# వంశ గౌరవం

ఈస్ట్మన్ కలర్

సాయికృష్ణ

స్క్రీన్ ప్లే దర్శకత్వం
యస్.రవీంద్రరెడ్డి

నిర్మాతలు
జాగర్లమూడి ఆదినారాయణరావు
రావి ఆంజనేయులు

నిర్వహణ
బొక్కిసం ఆంజనేయులు

సంగీతం చక్రవర్తి మాటలు జంధ్యాల

సీడెడ్ భాస్కర్ పిక్చర్స్ నైజాం విక్రమ్ ఫిలింస్ ఒరిస్సా శ్రీ వెంకటలక్ష్మి పిక్చర్స్
కృష్ణా ఎ లక్ష్మీనారాయణ విజయవాడ గుంటూరు-నెల్లూరు కళ్యాణి ఫిలింస్ ప.గోదావరి ఉషా పిక్చర్స్, ఏలూరు

కాలింగ్ బెల్ మోగింది.

వంట గదిలో స్టౌవ్ శుభ్రం చేస్తున్న సుజాత చేతులు కడుక్కొని నేప్‌కిన్‌తో చేతులు తుడుచుకుంటూ, డైనింగ్ హాలుదాటి డ్రాయింగ్ రూంలోకి వచ్చింది.

మళ్ళీ 'డింగ్ డాంగ్' - బెల్ మోగింది.

"వస్తున్నా !" సుజాత గబగబా నాలుగు అడుగులు వేసి తలుపు దగ్గిరకు వచ్చింది

"ఎవరూ ?" గడియ తీస్తూ అన్నది

"నేనే సుజా !"

"అదేమిటండి ! ఫ్లైట్ మిస్సయ్యారా ?" ఆదుర్దాగా అడిగింది.

"లేదు "

"మరి ! ఫ్లైట్ క్యాన్సిల్ అయిందా ?"

"అదీ కాదు !" అతని చిరునవ్వు ఆమెను కలవర పెట్టింది.

"అదేమిటండీ ? అదీ కాదు — ఇదీ కాదు అంటారు! మరెందుకు తిరిగొచ్చారు? మీ కాన్ఫరెన్సు పోస్టుపోన్ అయినట్టు తెలిసిందా ?" సుజాత భర్తను ఊపిరి పీల్చుకోనివ్వడం లేదు

"అదుగో అటు చూడు !" శివప్రసాద్ గార్డెన్ పాత్ ఆవల దూరంగా ఉన్న గేటు వైపు చూపిస్తూ అన్నాడు

సుజాత భర్త చూపించిన వైపు తల తిప్పింది

గేటు ముందు ఉన్న టాక్సీ కదిలి వెళ్ళిపోతున్నది

గేటు తెరుచుకొని అతను వస్తున్నాడు

అతని కుడి చేతిలో బ్రీఫ్‌కేసు ఉంది

రెండో చేతిలో కోటు మడిచి పట్టుకొని ఉన్నాడు



# మనసు కథ

వాసిరెడ్డి సీతాదేవి

కొత్త సీరియల్ ప్రారంభం!



మొక్కల మధ్యనుంచి నడచి వస్తున్నాడు

ఆ నడకలో ఏదో ప్రత్యేకమైన స్టయిల్ ఉంది

అస్తమిస్తోన్న సూర్యకాంతి అతని నీడను దారి పక్కన ఉన్న ముద్ద మందారాలమీద పరుస్తూన్నది

ఆజానుబాహువు! ఆరడుగుల ఎత్తు!

దగ్గరగా వస్తున్న ఆ స్ఫురద్రూపిని చూస్తూ అలాగే నిలబడింది సుజాత

గడప ముందుకు వచ్చాడు రెండు మెట్లు ఎక్కి ఆగిపోయాడు

మరో రెండు మెట్లు పైన భర్త పక్కన నిలబడి ఉన్న సుజాత చూపుల్ని కిందకు వాల్చుకుంది

భర్త కాళ్ల దగ్గిర రెండు సూట్‌కేసులు పెట్టి ఉన్నాయి

ఒకటి తన భర్తది మరి రెండోది? ఓ! ఆయనది కాబోలు తన భర్త టాక్సీ ముందుగా దిగి రెండు చేతులతో రెండు సూట్‌కేసులు పట్టుకొచ్చాడన్నమాట! తను గమనించనేలేదు ఆయన టాక్సీకి డబ్బులిచ్చి వెనక వస్తున్నాడన్నమాట!

అంటే ఇద్దరూ కలిసే వచ్చారు

ఇంతకూ అతనెవరు?

"మీట్ మై ఫ్రెండ్ డాక్టర్ శరత్‌బాబు"

"నమస్తే" బ్రీఫ్‌కేసు కిందపెట్టి కొంచెం వంగి అన్నాడు అతను

మనిషిలోనే కాదు మాటలో కూడా ఏదో ప్రత్యేకత ఉన్నది

"నమస్తే" చేతులు జోడించి అన్నది సుజాత

ఆయనగారొస్తే ఈయనగారు ప్రయాణం ఎందుకు మానుకోవాలి?

సుజాత ఆలోచిస్తూ భర్త చేతిలోని బ్రీఫ్‌కేసు అందుకొని లోపలకు నడిచింది

"ఒరేయ్ ప్రసాద్! రెండు సూట్‌కేసులూ నువ్వే మొయ్యాలట్రా?" అంటూ శరత్‌బాబు, శివప్రసాద్ చేతిలో నుంచి ఒక సూట్‌కేసు తీసుకోబోయాడు

"ఒరేయ్ శరత్! నన్ను కూడా నీకు కొంత సర్వీస్ చెయ్యనివ్వరా!" అంటూ సూట్‌కేసు ఇవ్వకుండానే రెండు చేతుల్తో రెండు పెట్టెలూ పట్టుకొని శివప్రసాద్ సుజాత వెనకే హాలులోకి నడిచాడు

"రేయ్! రేయ్! సర్వీస్ అంటే ఇంతేనటరా?"

"ఇంకేం చెయ్యమంటావో చెప్పరా మరి!"

సుజాత సోఫాసెట్ మధ్య ఉన్న టీకలం టేబుల్ మీద బ్రీఫ్‌కేసు పెట్టింది డైనింగ్ టేబుల్ దాటి లాబీకి ఆనుకొని ఉన్న గెస్టురూం తలుపు తెరిచింది

శివప్రసాద్ స్నేహితుడి సూట్‌కేసు గదిలో పెట్టి బయటికి వచ్చాడు

"శరత్ హేవ్ ఏ వాష్ అండ్ ఛేంజ్ యువర్ డ్రెస్!"

"ఓ కే! ఓ కే!" అంటూ శరత్ గెస్టు రూంకేసి నడిచాడు

"శరత్ పదినిముషాల్లో తయారు కావాలి! అలా బయటికి వెళ్ళొద్దాం!" వెనకనుంచి అన్నాడు శివప్రసాద్

"బయటికా? నో! నో! ఐయాం టైర్డ్!" ఆగి అన్నాడు శరత్‌బాబు

"అయితే వద్దులే! నీ ఇష్టం కాసేపు గార్డెన్‌లోనే కూర్చుందాం"

శరత్ తన గదిలోకి వెళ్ళాడు

శివప్రసాద్ సుజాతను వెదుక్కుంటూ వంట గదిలోకి వచ్చాడు సుజాత స్టౌమీద పాలగిన్నె పెట్టి, నెస్‌కేఫ్ డబ్బా తీసింది

"సుజా! వాడు కాఫీ తాగడు చిన్నప్పట్నుంచీ అలవాటులేదు" సుజాత వెనకే నిలబడి అన్నాడు శివప్రసాద్

ఓహో! అదా అసలు సంగతి? బాల్య స్నేహితులా! 'ఒరే – ఒరే' 'వాడూ – వీడూ' అనుకునేంత సన్నిహితులన్నమాట! అందుకే ఈయనగారు ప్రయాణం మానుకొని తిరిగొచ్చారు

ఆలోచిస్తూనే సుజాత భర్త ముఖంలోకి చూసింది

"కాఫీ తాగడా ? మజ్జిగ తాగుతాడా ?"

"ఛ ! ఛ ! అదేమిటోయ్ సుజా ! వాడిని చూస్తే చద్ది అన్నం తినే ముఖంలా కన్పించిందా ఏమిటి ?"

"మరి మీరే అన్నారు గదండీ కాఫీ తాగడని ?"

'కాఫీ తాగడంటే మజ్జిగ తాగుతాడనే అర్థం ఉందా ?"

"అబ్బ ! ఏమిటండీ ఈ బోరు ? ఇంతకూ ఏం తాగుతాడో చెప్పండి"

"బోర్ మాత్రం తాగడు"

"ఆయన తాగడేమో కాని మీరు మాత్రం నా చేత తాగిచ్చేస్తున్నారు"

"అలాగేం ?" అంటూ శివప్రసాద్ ఆమెను వెనకనుంచి పట్టుకొని తనవైపు తిప్పుకున్నాడు

"పొంగిపోతున్నాయ్ ! అయ్యయ్యో ! పాలు పొంగిపోతున్నాయ్ ! ఉండండీ !"

సుజాత ఆన చుట్టూ పెనవేసుకుని ఉన్న భర్త చేతుల నుంచి విడిపించుకున్నది

"మీ స్నేహితుడితోపాటు మీరు కూడా మజ్జిగ తాగితేనే మంచిదేమో !" అన్నది సుజాత కనురెప్పలు టపటప లాడిస్తూ

"ఆఁ !" ప్రసాద్ నోరు తెరిచాడు

"అవునండీ ! మీకు ఈ ఉద్రేకం తగ్గాలిగా ?"

"ఇంకా నయం !"

"ఏం ఆగారెం ?" సుజాత కళ్ళు గుండ్రంగా తిప్పింది

"చందమామ పొడిచాక-మల్లెమొగ్గ విచ్చాక"

"ఏమిటండోయ్ ! శ్రీవారూ ! జానపద పక్కీ అందుకున్నారు ?" సుజాత వచ్చే నవ్వును ఆపుకో లేకపోయింది

"వేగుచుక్క పొడిచేదాకా
తొలి కోడి కూసేదాకా
చెబుతాను — చెబుతాను —"

"ఏమిటండి చెప్పేది ? ముందు ఇది చెప్పండి"

"ఏమిటి ?"

"కాన్ఫరెన్సుకు ఎప్పుడు వెళ్తారు ? రేపు ఉదయం ఫ్లైట్‌కైనా వెళ్తున్నారా లేదా ?" సుజాత భర్తను నిలదీసి అడిగింది

...సంగతి తర్వాత చెబుతాగానీ, ముందు మా వాడికి టీ, నాకు కాఫీచేసి ఇవ్వు వాడికి టీ అలవాటు"

'ప్రసాద్ ! ఒరేయ్ ! నేను రెడీ !"

హాల్లోనుంచి శరత్‌బాబు పిలుపు విన్పించింది

"అదుగో వాడప్పుడే తయారయ్యాడు నీ పుణ్యమా త్వరగా నాక్కూడా టీ ఇచ్చెయ్‌శే !" అంటూ ప్రసాద్ వంట గదిలోనుంచి బయటికి వెళ్ళాడు

సుజాత ట్రేలో టీ కప్పులు తీసుకొని వచ్చింది శరత్‌బాబూ, శివప్రసాద్ ఎదురెదురుగా ఒకర్నొకరు చూసుకుంటూ కూర్చుని ఉన్నారు

ఏమిటి ? వీళ్ళకు మాటలు కూడా పడిపోయినై ! స్నేహితులు చాలా కాలానికి కలుసుకున్నారో ఏమో !

అయినా అదేమిటి భగ్నప్రేమికుల్లా - ఎన్నో మాట్లాడాలనుకొని ఎలా ప్రారంభించాలో తెలియక ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నట్టు కూర్చున్నారేం ? కళ్ళల్లోకి కళ్ళు కలిపి చూసుకుంటున్నార వీళ్ళు ?

వీళ్ళది ఇంత గాఢమైన స్నేహమా ?

ఏ రకం స్నేహం ?

ఆలోచిస్తూ సుజాత సోఫాల మధ్య ఉన్న సెంటర్ పీస్‌మీద ట్రే పెట్టింది

"రెండే తెచ్చారు మరి మీరు ?"

సుజాత చివ్వున తలెత్తి శరత్‌బాబును చూసింది

పెదవులమీద కదలిన చిరునవ్వు అతని ప్రశాంత వదనంలో వెన్నెల్లా పరచుకొన్నది

ఎంతటి చొరవా ?

ఇది చొరవా ? లేక తన నాగరికతను తెలియజేసే ప్రయత్నమా ?

"మీరు తీసుకోండి నేనిప్పుడు తీసుకోను" సుజాత మృదువుగా చెప్పింది

"మాతో కలిసి కూర్చుని టీ తీసుకోవడం మీకు ఇష్టంగా ఉండదా ?"

సుజాత గొంతుకు ఏదో అడ్డం పడినట్టు అయింది! ఏమిటీయన! ఆయనకు ఎంత స్నేహితుడైతే మాత్రం ఇంత చనువు తీసుకోవడం బాగాలేదు

...అసలు అతను వచ్చి అర్థగంటన్నా కాలేదు తనను చూసాడు నిముషాలు చూశాడేమో ! 'నమస్తే'తో కూడా కలుపుకుంటే మాట్లాడింది, ఇది మూడో మాటే

"డిసీజ్ టూమచ్" అని అంటే ?

అంటే ఏమౌతుంది ?

"కమాన్ సుజా! మరో ఖాళీ కప్పు తీసుకురా! అన్నాడు శివప్రసాద్

భర్తకేసి మరమురా చూసింది సుజాత

"ఆల్‌రైట్ ! నేనే తీసుకొస్తానుండు" అంటూ శివప్రసాద్ లేచి వంట గదిలోకి వెళ్ళాడు

"కూర్చోండి ! నిలబడ్డారేం ?"

ఏమిటా మర్యాద ?

ఆ గొంతులో వింత ఆప్యాయత ?

సుజాతకు అతని ముందు అలా నిలబడటం ఏదోగా అన్పించింది

అపరిచితుడు ! అతని ముందు కూర్చోవాలంటే అసలు మనస్కరించడం లేదు

ఆయన మరీనూ ! తను అక్కడ ఉండగా ఖాళీ కప్పు కోసం వంట గదిలోకి వెళ్ళడం ఏమిటి ?

సుజాత గిరున వెనక్కు తిరిగింది

ఒక్క అడుగు ముందుకు వేసింది

"వాడే తెస్తున్నాడుగా ? మళ్ళీ మీరెందుకూ ?"

సుజాత కాళ్లకు వెనకనుంచి బంధం పడినట్టు అయింది

అలాగే నిలబడిపోయింది

ముందుకు వెళ్ళలేకపోయింది

వెనక్కు తిరగలేకపోయింది

అతడికి వీపు చూపిస్తూ నిలబడటం అంతకంటే బాధాకరంగానే ఉన్నది

అయినా — ఈ మనిషేమిటి - తనను ఇలా వదిలేసి —

"సుజా ! ఏమిటి వచ్చేస్తున్నావ్ ? నేను నీ కోసం కప్పు తెస్తుంటేనూ !" శివప్రసాద్ ఎదురొచ్చాడు చేతిలో ఖాళీ కప్పుంది

## మానవత్వం

పుట్టిన ప్రతి మనిషికి
గిట్టేంత వరకూ బ్రతికేందుకు
మనిషిగా మనుగడను సాగించేందుకు
వీలునివ్వడం మానవత్వం, నాగరికం,
పేదరికపు రోగ క్రిములు
బడుగు దేహాలను తినేస్తూ ఉంటే
అడ్డుకునే శక్తులు మృగ్యమయిపోతే
విడూరంగా వినరించుకుని చెప్పుకోవడమే కా
మాటల చప్పుడ్లు చేయడమే తప్ప
చర్యల్లో నివారణ ఆతృత కనపడకుండాపోతే
లేని మనిషి స్థితి దైన్యం
ఉన్న మనిషి స్థితి అమానుషత్వం

**— డాక్టర్ వాడపల్లి లక్ష్మణరావు**

విజయవాడలోని జిల్లా జవహర్‌బాలభవన్‌వారు రిపబ్లిక్ దినోత్సవంనాడు నిర్వహించిన నృత్య ప్రదర్శనలో పాల్గొన్న జి ధనలక్ష్మి, జి భారతి, డి వి పద్మావతి, సి పూర్ణిమ, ఎం నాగవల్లి, ఎం నిర్మల, ఎం శ్రీలక్ష్మిలని చిత్రంలో చూడవచ్చు



సుజాత భుజంమీద చెయ్యివేసి "కమాన్!" అన్నాడు

ఆమె చెక్కిళ్ళు ఎరుపెక్కాయి

కళ్ళల్లో వెలుగు జిలుగులు పరుగులు తీశాయి

"ఎంత అందంగా ఉంది?" అన్నట్టు శరత్‌బాబు ఆమెకేసి చూశాడు రెండు ఎర్రగులాబీల మధ్యన రెండు నల్లతుమ్మెదలు పరుగులు తీస్తున్నట్టు అన్పించింది శరత్‌బాబుకు, ఎరుపెక్కిన చంపలపైన తుమ్మెదల్లాంటి ఆమె కనుపాపల్ని చూస్తుంటే

సుజాత తన భుజంమీద ఉన్న భర్త చేతిని మృదువుగా తొలగించింది అతని చేతిలో ఉన్న కప్పు తీసుకుంది భర్త పక్కనే సోఫాలో కూర్చుని టీ కప్పులు ఉన్న ట్రే మీదకు వంగింది

ఆమెకంటే ముందే ఒక టీ కప్పును అందుకొని శరత్‌బాబు ఆమె చేతిలో ఉన్న ఖాళీ కప్పులోకి కొంత టీని వంపాడు

శివప్రసాద్ రెండో కప్పు అందుకొని, కొంత టీని సుజాత చేతిలో ఉన్న కప్పులో పోశాడు సుజాత కప్పు నిండిపోయింది

నిండుగా ఉన్న టీ కప్పును శరత్‌బాబు ముందు ఉంచింది సుజాత

"మీరు తీసుకోండి ఇది నాకు చాలు!" రెండో కప్పు అందుకొన్నది

"నాకు టీ అలవాటు లేదు మీరు టీ తప్ప తాగరటగా?" ఇహ నోరు మూసుకొని శరత్‌బాబు టీ తాగుతాడని ఆశించింది సుజాత

"ఊఁహూ! వీడు చెప్పాడా?" అని టీ సిప్ చేశాడు

"చిన్నప్పటినుంచీ మీకు టీ అలవాటటగా?" అనుకోకుండానే అనేసింది సుజాత

అదేమిటి?

తనకు తెలియకుండానే తను అతనితో మాటలు పెంచుతోంది?

ఆలోచనలో పడింది ఆమె

"కాఫీ కంటే టీ మంచిదని తెలుసా?"

"తెలియదు తెలుసుకోవాలని కూడా లేదు"

రపీమని అనేసింది సుజాత ఏదో బరువు దించుకున్నట్టుగా గాలి పీల్చుకుని వదిలింది

శరత్‌బాబుకు వేడి వేడి టీ గొంతులోనుంచి బయటికి తన్నినట్టు అయింది

సుజాత ముఖంలో ఏదో చదవాలనే ప్రయత్నంలో ఉన్నట్టు పరిశీలనగా చూశాడు

సుజాత తల తిప్పుకొని భర్త శివప్రసాద్‌కేసి చూసింది

అతను తల వంచుకొని మౌనంగా టీ తాగుతున్నాడు

అతన్ని చూస్తుంటే వంటింట్లో వలికిపోయిన పాలమీదకు వంగి నాకుతున్న పిల్లి గుర్తువచ్చింది సుజాతకు

మనసు చివుక్కుమన్నది

ఇదేమిటి ఈయన ఇలా అయిపోయారు?

అపరిచితుడిముందు తనను కూర్చోబెట్టి ఒక్క మాటకూడా మాట్లాడడేం? ఈయనకు ఏమైంది చిన్ననాటి స్నేహితుడ్ని చూసేసరికి కడుపు నిండిపోయిందా? మాటలు కూడా పెగిలి రావడంలేదా?

"మీకు ఎందుకు తెలుసుకోవాలని లేదో నేను తెలుసుకోవచ్చా?"

సుజాత చివాలున భర్తమీదనుంచి చూపును మరలించింది శరత్‌బాబువైపు తలెత్తి చూసింది

అతను ట్రేలో ఉన్న నేప్‌కిన్ అందుకొని, టీ తాగిన పెదవుల్ని సుతారంగా అద్దుకుంటున్నాడు నేప్‌కిన్ ట్రేలో పెట్టి కనుబొమల్ని కొంచెంగా పైకి లేపుతూ సుజాత ముఖంలోకి చూశాడు శరత్‌బాబు

జిడ్డు!

లాగుతున్నాడు!

మాటలోనుంచి మాటను గుంజుతున్నాడు!

"మీకెందుకు తెలుసుకోవాలనిలేదో నేను తెలుసుకోవచ్చా?" అబ్బ! ఏం ప్రశ్న? తెలుసుకోకపోతే ఆయన కొంప మునిగిపోతుందా?

సుజాత కుతకుతలాడిపోతున్నది

"నేను టీ తాగనుకనక!" అనేసింది పూర్తిగా తన ఆలోచనల్నుంచి బయటపడకుండానే

"మరిప్పుడు తాగారుగదా?"

సుజాతకు ఈసారి నిజంగానే వళ్ళుమండింది

"మరింకెప్పుడూ తాగను అంత తాగినా మీముందు కూర్చునిమాత్రం తాగను" అని సుజాతకు అరిచి చెప్పాలనిపించింది కాని చెప్పలేకపోయింది

విసురుగా లేచి నిలబడింది

భర్త శివప్రసాద్ చేతిలో ఉన్న టీ కప్పును గుంజుకొని ట్రేలో విసురుగాపెట్టి, వంటింటివైపుకు చరచరా నడిచి వెళ్ళిపోయింది

## 2

"సుజాతా! సుజాతా!"

భార్యను పిలుస్తూ శివప్రసాద్ డ్రాయింగ్ రూంలోకి వచ్చాడు

సుజాత చదువుతున్న ఈవ్స్ వీక్లీ ముందున్న బల్లమీద పడేసి, తలతిప్పి భర్తకేసి చూసింది

"డిన్నర్ అయిందా?"

"ఆఁ అయింది" సుజాత లేచి నిలబడింది

"అయితే వడ్డించు! వాడ్ని పిల్చుకొస్తాను"

"రావచ్చుగాని, మీరిలా కూర్చోండి! మీతో కొంచెం మాట్లాడాలి" సుజాత భర్త చెయ్యి పట్టుకొని కూర్చోబెట్టింది

"వాడు టైం ప్రకారం అన్నీ చేస్తాడు తొమ్మిదింటికే భోజనం చేసే అలవాటుంది"

"ఇంకా పదిహేను నిముషాలుంది ఇప్పుడు ఎనిమిదీ నలభైఐదు అయింది కూర్చోండి" సుజాత లేవబోతున్న భర్త భుజంమీద చెయ్యివేసి ఆపింది

శివప్రసాద్ స్థిమితంగా కూర్చుని "ఏమిటి?" అన్నట్టు భార్య ముఖంలోకి చూశాడు

"ఎవరండీ అతను?"

"ఎవరూ?" అప్రయత్నంగానే అనేశాడు

"ఎవరేమిటండీ? ఆయనే? మీ స్నేహితుడు?"

"స్నేహితుడని చెప్పానుగా?"

"అబ్బ అది కాదండీ! ఆయనకు అడ్రసులేదా?"

"ఎందుకు లేదూ? అరవై ఆరు, అడయార్, మద్రాసు"

"అడ్రసంటే అడ్రసు చెప్పమనికాదు డాక్టర్ అన్నారుగా? ఏ ఆసుపత్రిలో పని చేస్తున్నాడూ అని? ఇంకా"

"హాస్పటల్లోనా? వాడు మనుషుల డాక్టరు కాదు"

"పశువుల డాక్టరా?" వ్యంగ్యంగా అన్నది సుజాత

"ఛ! ఛ! అదీ కాదు!" తాపీగా చెప్పాడు ప్రసాద్

"అయితే మరి హిప్నాటిస్టా? లేక సైకియాట్రిస్టా?" ఉసిగా, కసిగా అన్నది

"సుజాతా?" బిగ్గరగా అరుస్తూ చివాలున లేచి నిలబడ్డాడు శివప్రసాద్

అతని కళ్ళు ఎరుపెక్కాయి

"ఎందుకండీ అలా అరుస్తారూ? ఇప్పుడు

# ఇప్పుడు! ప్రపంచ ప్రసిద్ధమైన పసిమిఛాయ రహస్యం ఇండియాలో!

# క్లియర్-టోన్

ప్రత్యేక దినుసు చర్మానికి తేటను, పసిమిఛాయను తెస్తుంది-ప్రకృతి సిద్ధంగా.

శాస్త్రీయమైన సూత్రం మచ్చల్నీ, కళంకాల్నీ తొలగిస్తుంది.



మేలైన సూర్యకవచం చర్మం నల్లబడటాన్ని అరికట్టుతుంది.

సమృద్ధిగా చెమ్మనిచ్చే పదార్థం చర్మాన్ని మృదువుగా చేస్తుంది.

## పరిపూర్ణమైన పసిమిఛాయ క్రీం

ప్రపంచమంతటా వివిధ దేశాలలో లక్షలాది సుందరులు క్రమంతప్పకుండా వాడుతున్నారు, **క్లియర్-టోన్**

అంతర్జాతీయ ఔషధ శాస్త్రపరిశోధనా ఫలితమైన ఈ శాస్త్రబద్ధమైన పసిమిఛాయ సూత్రీకరణను నికొలాస్ లాబరేటరీస్ ఇండియా లిమిటెడ్ వారు మీకందిస్తున్నారు

అంతర్జాతీయ స్వీకరణ పొందిన సూత్రం **క్లియర్-టోన్** మీ చర్మానికి తేటను పసిమి-ఛాయను తెచ్చేందుకు ఇండియాలో లభించే మరే యితర క్రీంలోనూ లేని ఒక ప్రత్యేక దినుసు కలిగి ఉంది

**క్లియర్-టోన్** క్రీం మీ చర్మానికి మరింత పసిమిఛాయను తెచ్చేందుకు మచ్చల్నీ కళంకాల్నీ తొలగించేందుకు ప్రకృతి సిద్ధంగా పనిచేస్తుంది అందులోని శాస్త్రీయ సూత్రీకరణ హాని కలిగించే అల్ట్రావయొలెట్ కిరణాల నుండి మీకు రక్షణ కలిగించి మీ చర్మం నల్లబడటాన్ని అరికట్టుతుంది అంతేకాదు **క్లియర్-టోన్** మీ చర్మాని కవసరమైన చెమ్మను అతి సున్నితమైన పద్ధతిలో ఇస్తుంది అతేడామీకై మీరే చూడండి **క్లియర్-టోన్** క్రమం తప్పకుండా వాడండి మరి 6 వారాల్లో దాని ఫలితాల్ని చూసి వళ్లు పులకరించి పొండి

ప్రపంచమంతటా ప్రఖ్యాతిచెందింది






మేలైన సూత్రం
మేలైన చర్య

## పసిమిఛాయ రహస్యం-ప్రకృతి సిద్ధంగా క్లియర్-టోన్

లండన్. పారిస్. న్యూయార్క్.

daCunha/NICL/3/81-TL

నే నేమన్నానని ?'' సుజాత లేస్తూ భర్త ముఖంలోకి చూసి త్రుళ్లిపడింది

''ఏమండీ ! ఏమండీ ! ఏమిటండీ అలా అయిపోయారు ?'' ఆదుర్దాగా అన్నది సుజాత

శివప్రసాద్ నిట్టూర్పు విడిచి నిలదొక్కుకున్నాడు స్థిమితపడ్డాడు

''చూడు సుజా ! నా స్నేహితుడ్ని గురించి చులకనగా, తేలిగ్గా మాట్లాడితే నేను సహించలేను ''

''సారీ ! మరెప్పుడూ అలా మాట్లాడను క్షమించండి ''

తను భర్తను క్షమించమని ఎందుకు కోరినట్టు ? అసలు అతనికి అంత కోపం తెప్పించే తప్పు తనేం చేసింది ? తమాషాగా మాట్లాడింది తను అంతకుమించిన నేరమేమీ తను చెయ్యలేదే ? ఈ మాత్రానికే ఆయనకు అంతగా వళ్ళు తెలియని కోపం రావాలా ?

ఎంత స్నేహం అయితే మాత్రం మరీ ఇంత ఇదిగా

''సుజాతా !''

ప్రసాద్ కంఠంలో ఆర్ద్రతకు సుజాత ఆలోచనలు మరో మలుపు తిరిగాయి

''అయ్యో ! ఇంతలోనే ఇంత మార్పా ? తన ప్రవర్తనకు బాధపడుతున్నాడా ? ఆయన మనసు మహా మెత్తన ! ఆ విషయం తనకు తెలుసు తన స్నేహితుడ్ని హేళన చేసిందనే భావంతోనే తనమీద అరిచాడు తన మనసు బాధపడిందని ఇప్పుడు తను బాధపడుతున్నాడు ''

''డిన్నర్ రెడీ అయింది టేబుల్‌మీద అన్నీ సర్దేశాను మీ స్నేహితుడ్ని పిలవండి'' తన బుర్రలో తిరుగుతున్న ఆలోచనలన పక్కకు తోసివేస్తూ అన్నది సుజాత

''శరత్ న్యూక్లియర్ సైన్సులో డాక్టరేట్ పొందాడు మద్రాసు ఐ ఐ టి లో అణువిజ్ఞాన శాస్త్ర విభాగంలో అసిస్టెంటు ప్రొఫెసర్‌గా పని చేస్తున్నాడు త్వరలోనే ప్రొఫెసర్ కూడా అవుతాడు ''

''అలాగాండీ ! అది చెప్పమనేగదండీ నేను అడుగుతా !'' ఇంకా ఏదో అడగాలని ఆరాటంగా ఉంది సుజాతకు

అంతలోనే శివప్రసాద్ మళ్ళీ అన్నాడు — 'ఇక్కడ న్యూక్లియర్ కాంప్లెక్సులో సెమినార్ జరగబోతున్నది ఆ సెమినార్‌లో పేపరు చదవడానికి వచ్చాడు మద్రాసు ఫ్లైట్ నుంచి దిగాడు ఆదే ఫ్లైట్ ఢిల్లీ పోతుంది ఢిల్లీ ఫ్లైట్‌కు రిపోర్టు చేసి లాంజిలోకి వస్తుండగా, సరిగ్గా బుక్ స్టాల్ దగ్గర ఎదురైనాడు ఒక సెకండ్ దాటితే వాడు లగేజ్ కలక్షన్ ఎన్‌క్లోషర్‌లోకి వెళ్ళిపోయేవాడే ! ప్రయాణం నేను రేపు ఉదయానికి మార్చుకున్నాను రేపు మార్నింగ్ ఫ్లైట్‌కు టికట్ కన్‌ఫర్మ్ చేయించుకొని, వాడ్ని తీసుకొచ్చాను ''

''సెమినార్ ఎన్ని రోజులుంటుంది ?'' తీరా అడిగాక ఎందుకు అడిగానా అన్నట్టు నాలుక కరచుకుంది సుజాత

''మూడు రోజులు ''

''ఈ మూడు రోజులూ ఆయన ఇక్కడే ఉంటాడా ?'' అడిగాననుకొని గాభరాపడింది

భర్త ముఖంలోకి చూసి ఆ మాట తను పైకి అనలేదని ఖాయం చేసుకుంది

''రేపు ఉదయం మీరు ఢిల్లీ వెళుతున్నారుగా ?'' ఏమిటోగా అడిగింది సుజాత

''ఊఁ వెళ్తే ?''

''అదే — వెళుతున్నారుగా అని !''

''నీ ఉద్దేశ్యం ఏమిటి ? సూటిగా చెప్పు !''

''ఆయనగారు ఇక్కడే ఉంటారా ?''

''నీకేమైనా అభ్యంతరమా ?''

సుజాతకు వెలక్కాయ గుజ్జు గొంతున పడ్డట్టు అయింది

ఏమంటే తన భర్త ఏమనుకుంటాడోనని 'అబ్బే ! నాకెందుకండీ అభ్యంతరం ? ఆయన మీ స్నేహితుడు'' అనేసింది అలా అనకుండా ఉంటేనే బాగుండేది అనిపించింది తీరా అన్న తర్వాత

''నీకు లేని అభ్యంతరం వాడికెందుకూ !''

''తనకు అభ్యంతరం లేదని చెప్పిందా ?''

భర్త ఊళ్లో లేనప్పుడు, ముక్కూ మొహం తెలియని పరాయి మగవాడు ఇంట్లో ఉండటానికి ఏ ఇల్లాలు అంగీకరిస్తుంది ?

''నేను తిరిగొచ్చేదాకా వాడిక్కడే ఉంటాడు '

''అయ్యో ! ఉండనివ్వండి నేను వద్దన్నానా ?''

''వద్దనడానికి నువ్వెవరూ ? వాడు నా ప్రాణ స్నేహితుడు మా ఇద్దరి అనుబంధం ఎలాంటిదో నీకు తెలియదు ''

''భార్యాభర్తలకు మించిన అనుబంధమా ?'' పెదవులదాకా వచ్చిన మాటల్ని మింగేసుకుంది సుజాత

సుజాతకు కడుపులో ఏదో దేవినట్లు అయింది

ఏమిటీ స్నేహం ?

ఏమిటీ స్నేహితులు ?

అన బంధమట ! అనుబంధం !

అతగాడ్ని చూడగానే ఈయనగారికి ఏమైపోయింది ?

వీళ్ళిద్దరిమధ్యా ఉన్నది నిజంగా స్నేహమేనా లేక లేక

సుజాత ఆపైన ఆలోచించలేకపోయింది

బుర్ర గిర్రున తిరిగిపోతున్నట్లుగా ఉన్నది

''ఐయాం సారీ సుజాతా ! నా ఆబ్‌సెన్సులో వాడు ఇక్కడ ఉండటం ఇష్టం లేకపోతే చెప్పు అశోకాలో వాడికి రూం బుక్ ఆయే ఉంది వెళ్ళిపోతాడు నా బలవంతంమీదే వాడిక్కడకు వచ్చాడు ఇష్టం లేకపోతే చెప్పు ! ఈ రాత్రికే వెళ్లిపోతాడు '

కొద్ది క్షణాల క్రితం ఎంతో పెడసరంగా మాట్లాడిన తన భర్త ఇంతలోకే ఎంత మారిపోయాడో అనుకుంటూ అతని ముఖంలోకి చూసింది సుజాత

ఆమె నవ్వింది

ఆ నవ్వు ఎరువు తెచ్చిపెట్టుకున్న నగలా ఉంది

''నా కిష్టం లేకపోవడం ఏమిటండీ ? మీ ఇష్టమే నా ఇష్టం మీరు మెచ్చిందే నాకు నచ్చేది మీ అంగీకారమే నా అంగీకారం ''

యాంత్రికంగా మాట్లాడుతున్న సుజాతకు తను ఎక్కడ ఆపేసిందీ గుర్తు రావడంలేదు

''మీ స్నేహితుడు నా స్నేహితుడు కాడా ? నా ప్రాణం మీరయితే — మీ ప్రాణం ఆయనైతే — ఆయన ప్రాణం నేనైతే — '' ఏమిటీ పిచ్చి ఆలోచనలు తనకు ?

ఇంకా నయం ఈ మాటలు తను బయటికి అనలేదు తన భర్త ప్రశాంతంగానే తన ముందు నిలబడి ఉన్నాడు అంటే తను ఈ మాటలు పైకి అనలేదనటానికి ఇంతకంటే రుజువేం కావాలి ?

''ఢిల్లీనుంచి మీరు తిరిగెప్పుడొస్తారూ ?''

ఎక్కడో, దేన్నో వెదుకుతూ అది కన్పించక తనలోతనే సణుక్కుంటున్నట్టుగా అన్నది

''తొమ్మిది, గురువారం, ఈవెనింగ్ ఫ్లైట్‌లో వస్తాను ''

సుజాత వేళ్ళుమడిచి చూసుకుంది









డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**కె వి – ఉరవకొండ**

నాకు 20 సంవత్సరములు ఆరు సంవత్సరాల నుండి ఫిట్సు చాలా ఎక్కువగా వస్తున్నవి అప్పటి నుండి మాత్రలు వాడుతున్నాను వ్యాధి ఏమాత్రము తగ్గలేదు ఈ వ్యాధి నివారణకు మీ సలహా ఏమిటి ?

★ మీకు ఉన్న రోగం గ్రాండ్‌మాల్ ఎపిలెప్సీ అయి ఉండాలి ఈ రోగానికి కొన్ని సంవత్సరాల పాటు మందులు వాడుతూ ఉండాలి కొందరికి కొన్నేళ్ళ తర్వాత ఈ ఫిట్సు రావటం తగ్గిపోతాయి డైలాన్‌టిన్ సోడియం, ఎప్టాయిన్ ఎన్‌కెఫబాల్ మొదలయిన మందులను వైద్యుల పర్యవేక్షణలో వాడటం చాలా అవసరం

**జె వి ఆర్. – వెంకటాపల్లి**

నా వయస్సు 20 సంవత్సరములు స్తనములు పెరుగుతున్నవి కుడివైపుకన్న ఎడమవైపు పెద్దగా వున్నది వీటికి ఏ మందులు వాడాలి ?

★ మగవారిలో స్తనములు పెరగటాన్ని "గైనకోమాస్టియా" అని అంటారు వీటి పెరుగుదల హార్మోనుల ప్రభావంపై ఆధారపడి ఉంటుంది మగవారిలో స్త్రీల హార్మోనులు, స్త్రీలలో మగవారి హార్మోనులు సహజంగా ఉంటాయి కాని అవి లివరులో హరించబడతాయి అలా జరుగనప్పుడు మగవారికి స్త్రీల లక్షణాలు, స్త్రీలకి మగలక్షణాలు రావచ్చును

ఇటువంటి లక్షణాలు ఉన్నవారు రెండు మూడు సం॥లు అలాగే ఉంటే శస్త్ర చికిత్స చేయించుకోవలసి ఉంటుంది మందులతో పెద్దగా లాభం ఉండదు

**ఎ యస్ జి ఆర్. - వరంగల్**

నేను ప్రతి చిన్న విషయానికి చలించి పోతుండటం వల్ల కలత చెంది రాత్రి సరిగ్గా నిద్ర రావటం లేదు ఒక్కోరోజు తెల్లవారే వరకూ గూడా నిద్రరాదు దీనికి ఏమి చెయ్యాలి ?

★ తాత్కాలికంగా కాంపోజ్, వాలియం – 2 వంటి మాత్రల వాడకం వల్ల ఉపశమనం కలిగినా మానసిక ఆందోళనకిగాను సైకియా ట్రిస్టుల ఆలోచన పొందటం అవసరం ప్రతి విషయాన్నీ పట్టించుకోవటం ఒకేసారిగ కాకపోయినా అంచె లంచెలుగా నయినా మానటం మంచిది

**యు. ఎస్ - హైదరాబాద్**

నా వయస్సు 19 సంవత్సరములు దాదాపు ఒక నెలరోజుల నుండి కుడి బీజంలో సన్నగా నొప్పి ప్రారంభమై కొద్ది రోజులలోనే నొప్పి ఉధృతమై బీజం వాచినది తరువాత నొప్పి చాలా వరకు తగ్గిపోయింది ఎడమ బీజానికి గూడా వాపు వ్యాపిస్తున్నట్లుగా వున్నది దీనికి ఏమి చెయ్యాలి ?

★ ఈ వాపు టెస్టిస్ వాయటం వల్లగాని, టెస్టిస్ పైపొరలలో నీరువంటి ద్రవం చేరటం వల్లగాని వచ్చి ఉండవచ్చును మొదటిదాన్ని ఆర్కైటిస్ అనీ, రెండవదాన్ని హైడ్రోసీల్ అనీ అంటారు ప్రత్యక్షంగా పరీక్షిస్తేగానీ ఏదయినదీ తెలియదు

హైడ్రోసీల్ అయితే ఆపరేషన్ చేయించుకో వలసి ఉంటుంది ఆర్కైటిస్ అయితే హైట్రజాన్ మాత్రలు, యాంటీబయాటిక్‌లు వాడవలసి ఉంటుంది

**బి యస్ ఆర్. ఎల్ – కాకినాడ**

నా భర్తకు నేను రెండవ భార్యను మొదటి భార్యవల్ల యిద్దరు పిల్లలు కలిగాక వాసెక్టమీ చేయించుకున్నారు మరల సంవత్సరము క్రితం రీకెనలైజ్ చేయించుకున్నారు నేను డాక్టర్‌కి చూపించుకొనగా ఏ డిఫెక్టూ లేదు అని చెప్పారు మాకు పిల్లలు కలిగే అవకాశం వున్నదా ? సాధారణంగా బహిష్టు అయిన తరువాత ఎన్నవ రోజునుంచి ఎన్నవ రోజుదాకా గర్భధారణకు అవకాశం వుంటుంది ?

★ రీకెనలైజేషన్ తర్వాత పిల్లలు కలిగే అవకాశం ఉన్నది బహిష్టు అయిన 10 వ రోజు నుంచి 16 వ రోజుదాకా గర్భధారణ అవకాశం ఉన్నది అంటే ఋతుక్రమం సరిగా వచ్చేవారికి మాత్రమే ఈ పరిధి వర్తిస్తుంది ●

---

ఈ రోజు ఆదివారం !

ఐదు !

అంటే ఇంకా నాలుగురోజులకా ?

"మీరు రాకముందే మీ స్నేహితుడి సెమినార్ అయిపోతుందిగా ? మీరొచ్చేలోపలే వెళ్లిపోతాడా ?" అడగకూడదనుకుంటూనే అడిగేసింది

"నే వచ్చేదాకా ఉంటాడు నే వచ్చాక కూడ మరో రెండు రోజులుంటాడు "

"ఉంటానన్నాడా ?"

ఇదేం ప్రశ్న ? అయినా తను అనేసింది !

"ఏం నేను వచ్చేలోపలే అతను వెళ్ళిపోతే నీ కొచ్చే నష్టం ఏమిటి ?" శివప్రసాద్ సుజాత కళ్ళలోకి చూస్తూ అన్నాడు

"నాకు నష్టం ఏమిటండీ ? నన్నేమైనా ఎత్తుకుపోతాడా ఏం ?" అనాలనిపించింది సుజాతకు

కాని "నా కొచ్చే నష్టమేమిటండీ ? మనిల్లు ఏమైనా దోచుకుపోతాడా ఏం మీ స్నేహితుడు ? ఆప్తమిత్రులు ! ఎన్నాళ్లకెన్నాళ్లకో కలిశారు కలిసి నాలుగురోజులైనా ఉండే అవకాశం లేకపోయిందే

## మనసు కథ

అనే నా బాధ" అన్నది

"అందుకేగా వాడ్ని ఉండమన్నాను ?"

"అయితే ఇంకేం ! ఉంటానన్నాడుగా ?"

శివప్రసాద్ భార్య ముఖంలోకి చూశాడు

"అదేమిటండీ మళ్ళీ అలా చూస్తారు ? రాక రాక వచ్చిన మీ స్నేహితుడు మనింట్లో నాలుగు రోజులుండిపోవడం నాకు మాత్రం సంతోషంకాదా ?"

"నీకు నిజంగా సంతోషంగా ఉందా ?"

"నిజంగా నేనండీ ! మీ మీద ఒట్టు !"

"ఓ ! ఐసీ !" నిట్టూర్చాడు శివప్రసాద్

అంతలోనే సుజాత ఆలోచనల ప్రవాహంలో పడి కొట్టుకుపోసాగింది

అదేమిటి తను అలా అన్నదేం? అతడు ఇక్కడ ఉండటం తనకు సంతోషం ఏమిటి ? తనెందుకలా అనేసింది ? నిజంగా తనకు సంతోషంగా ఉందా ? అలా మాట్లాడితే మరో భర్త అయితే ఏమను కుంటాడు ? ఏ భర్తయినా అనుకుంటాడు అదే ? ఆ మాటే !

మరి ఈయనగారేమిటి ఇంతగా ఆనందిస్తున్నాడు ? నిజంగా సంతోష పడుతున్నాడా ? లేక తనను పరీక్షిస్తున్నాడా ? అసలే ఈయనకు మొహమాటం ఎక్కువ ఉండమని అన్నారే అనుకుందాం ఆ పెద్దమనిషి ఎలా ఒప్పుకున్నాడు ?

పెద్దమనిషి ?

అతడు పెద్దమనిషి ఎలా అవుతాడు ?

స్నేహితుడు ఊళ్లో లేనప్పుడు స్నేహితుడి ఇంట్లో ఉండటానికి సిద్ధమైనవాడు పెద్దమనిషి ఎలా అవుతాడు ?

కాడు ! కానేకాడు !

కాకపోతే మాత్రం తనకెందుకు భయం తనను ఏం చెయ్యగలడు ?

ఒకవేళ ఏమన్నా చేస్తే ?

ఛ ! ఏం చేస్తాడు ?

ఛ ! ఛ ! తను ఈ విషయం ఇంతగా సాగదీసి ఆలోచిస్తోందేం – అప్పరాల్

తన ఆలోచనలు తనకే రోతగా అనిపిస్తున్నాయ్

(ఇంకా వుంది)

# మైనపు బొమ్మలు

గుడిసేవ సుందరరామయ్య



పారిస్ కార్నర్‌లో షాపింగ్ ముగించుకొని గబగబా రోడ్డు మీదికి వచ్చాం నేను, శేఖర్

"రిక్షాలో వెళ్దామా ?" అని అడిగాడు శేఖర్ బ్రీఫ్‌కేసును మరో చేతిలోకి మార్చుకొంటూ

"స్టేషన్ దగ్గరే అన్నావుగా! ఇంకా టైమ్ కూడా వుంది కాబట్టి మెల్లగా నడుచుకొంటూ వెళ్దాం!" అన్నాను చేతిలోని సూట్‌కేసును మరింత గట్టిగా పట్టుకొంటూ

విశాలమైన ఆ రోడ్లు, ప్రక్కనేవున్న ఎత్తైన బిల్డింగులు ఎంతో ముచ్చట గొల్పుతున్నాయి

పరిసరాలను చూసుకొంటూ రోడ్డు దాటి అవతలవైపుకు వెళ్లాం! చైనా బజారు చాలా హడావుడిగా వుంది సాయంత్రం సమయం కావటం చేత చాలా రద్దీగా వుంది వచ్చేవాళ్లు వెళ్లేవాళ్లు నడవటానికి ఆ ఫుట్‌పాత్ చాలటంలేదు కొట్లో చోటు చాలలేదన్నట్లు వ్యాపారస్థులు తమ సరుకులను ఫుట్‌పాత్‌మీద కూడా పరిచారు

కొట్లలో రకరకాల వస్తువులను అమర్చిన తీరు చూపరులను గొప్పగా ఆకర్షిస్తూంది టేప్ రికార్డర్స్, ట్రాన్సిస్టర్స్, కాసెట్స్, బెల్ట్స్ ఒకటేమిటి? రకరకాల ఫ్యాన్సీగూడ్స్, సూట్‌కేసులు– అక్కడ దొరకని వస్తువంటూ లేదన్నంత భ్రమ కల్గిస్తూంది ఆ బజారు

ఎంత చూడకూడదనుకొన్నా దృష్టిని ఆ కొట్లవైపు మళ్లించకుండా వుండలేకపోయాను శేఖర్ మధ్య మధ్య నన్ను చూసి (పల్లెటూరివాడిలా అమాయకంగా వస్తువులవైపు చూస్తున్నందుకు) పరిహాసంగా నవ్వుతున్నాడు

"వీళ్లు అమ్ముతున్నవి ఫారిన్ వస్తువులేనా?" అని అడిగాను

"ఆ పేరుతో అమ్మే దేశవాళీ సరుకులు!" అన్నాడు

"అదేమిటోయ్! ఆ కాసెట్స్ చూడు! అచ్చం జపాన్ కేసెట్స్‌లా వున్నాయి!" అన్నాను

"మెరిసేదంతా బంగారం కాదన్న సామెత నీవు వినలేదా? అవన్నీ ఇమిటేషన్ సరుకులు!"

"మరి తెల్సికూడా ఇంతమంది జనం వాటి కోసం ఎందుకు ఎగబడుతున్నారు?"

"నీ కిక్కడ కన్పించే జనంలో కొనేది కొందరే! పాపం అమాయకులు! మిగతావాళ్లంతా సరదాగా చూడటానికి వచ్చేవాళ్లే!"

బర్మా బజారు దాటి బీచ్ స్టేషన్లోకి అడుగు పెట్టాం మేము వెళ్లేసరికి సర్కార్ ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫామ్మీదికి వచ్చేసింది శేఖర్ సరాసరి రిజర్వేషన్ చార్ట్ దగ్గరకు నడిచాడు నేను కూడా అతన్ని అనుసరించాను

"మన కంపార్ట్‌మెంట్ బాగా ముందు వున్నట్లుంది!" అంటూ ముందుకు నడిచాడు

శేఖర్ చూపించిన కంపార్ట్‌మెంట్లోకి అడుగు పెట్టాను మాకు రిజర్వ్ చేసిన కుపేలో ప్రవేశించి సూట్‌కేసు పక్కన పెట్టాను

"ట్రయిన్ బయల్దేరటానికి ఇంకా టైమ్ వుంది మనం ఏదైనా టిఫిన్ చేసి వస్తే బాగుంటుంది!" అన్నాడు శేఖర్

"నువ్వెళ్ళి చేసిరా!" అన్నాను

# స్వయంగా మీకు చాలినంత లభిస్తున్నదని నమ్మకంగా మీరు చెప్పుకోగలరా?





"మా డాక్టరుగారు హార్లిక్స్‌ను సిఫారసు చేసినప్పటినుంచి మా కుటుంబమంతా రోజూ హార్లిక్స్ తీసుకునేట్టు అలవాటు చేశాను

మీరు కూడా మీ కుటుంబానికి హార్లిక్స్ ఇస్తున్నారా?"

చాలా మంది తల్లులు తమ తమ ఆహార పదార్థాలలో ఆరోగ్యానికి ఏది మంచిదో అది చాలినంత లభిస్తుందో లేదో స్పష్టంగా చెప్పలేరు

అందుచేతనే వారు హార్లిక్స్‌ను నమ్ముకున్నారు

హార్లిక్స్ రోజూ క్రమం తప్పకుండా తీసుకున్నట్టయితే మీ కుటుంబానికి పుష్టికరమైన సంపూర్ణ ఆరోగ్యం చేకూరుతుంది

ఎందుచేతనంటే, చిక్కటి పాలు, మాల్టెడ్ బార్లీ గోధుమ పుష్కలంగా హార్లిక్స్‌లో ఉన్నాయి అవే ప్రధాన పోషకాహారానికి మూలం

హార్లిక్స్‌ను నిత్యం తీసుకోవటం ఎంతో మంచిది. మీ మనసులోని అన్ని చింతలనూ తొలగిస్తుంది




# హార్లిక్స్ - మంచి పుష్టికరమైనది

HTD-HMM 7042

"నువ్వు రావా ?" అని అడిగాడు.

"నాకు ఆకలిగాలేదు. వచ్చేటప్పుడు ఏవైనా ఫ్రూట్స్ దొరికితే పట్టుకురా !" అన్నాను బయటకు వెళ్తున్న శేఖర్‌తో.

నేను కంపార్ట్‌మెంట్ దిగి క్రిందికి వచ్చి ప్లాట్‌ఫామ్మీద నిలబడ్డాను. జనం పెద్దగా లేరు. అవతల ప్లాట్‌ఫామ్మీద మాత్రం వచ్చేపోయే జనం సందడి చేస్తున్నారు. లోకల్ ట్రయిన్స్ అన్నీ అక్కడే ఆగుతున్నాయి. కాస్సేపు అలానే చూస్తూండి పోయాను.

అంతలో వెనుకనుంచి "ఎక్స్‌క్యూజ్ మి సార్!" అన్నమాటలు వినిపించాయి.

వెనుక్కి తిరిగాను.

ఎదురుగా ఓ అపరిచిత వ్యక్తి కన్పించాడు.

నా కంటె అయిదారేళ్ళ ఎక్కువగావుంటాయి. నల్లని పాంట్‌మీద తెల్లని చొక్కాను టక్ చేశాడు. చొక్కానిండా నల్లటి మురికి మచ్చలున్నాయి. చేతిలో ఓ ఇంగ్లీషు నవల వుంది. కాళ్ళకు హవాయ్ చెప్పులున్నాయి.

"సార్ ! మీది కాకినాడేనా ?" అని అడిగాడు గాగుల్స్ తీస్తూ.

"కాదు. గుంటూరు !" అన్నాను.

"తెలుగువారైవుంటేచాలు ! నా పరిస్థితిని సహృదయంతో అర్థం చేసుకొంటారు. బై దిబై ! నా పేరు పవన్‌కుమార్. మాది విజయవాడ !" అన్నాడు కరచాలనం కోసం చేయి అందిస్తూ.

అతని మాటలతీరు, తనంతట తాను పరిచయం చేసుకొంటున్న ధోరణి నాకు నచ్చలేదు. కాని అయిష్టంగానే అతని చేతిలో చేయి వేస్తూ "మీకేం కావాలి ?" అని అడిగాను.

"ఎ స్మాల్ ఫేవర్ సార్ ! నేను మద్రాసువచ్చి వారం రోజులైంది. ఇంటర్వ్యూ కోసం వచ్చాను. బస్సులో పర్సుపోయింది. రెండురోజుల నుంచి మీల్స్ కూడా లేదు. ఎవరినైనా అడగాలంటే అభిమానం అడ్డు వస్తూంది !" అన్నాడు ఇంగ్లీషు నవలలో పేజీలు త్రిప్పుతూ.

అతని మాటలు నమ్మబుద్ధి కాలేదు. ఎందుకంటే ఆకలి బాధను అనుభవిస్తున్న లక్షణాలు అతనిలో కన్పించలేదు.

"మీరు నన్ను అనుమానిస్తున్నారు కదూ ! అందుకనే సార్ ! చొరవ తీసుకొని ఎవర్నీ అడగటం లేదు. కాని మిమ్మల్ని చూడగానే అడగాలన్పించింది!" అంటూ నవలలోంచి ఓ ఫోటోను బయటకు తీశాడు.

"చూడండి సార్ ! ఇది మా ఫామిలీ ఫోటో! వీళ్ళంతా విజయవాడలో వుంటున్నారు. నేను రాలేదని ఎంత కంగారు పడుతున్నారో ! మీ లాంటి వాళ్ళను అడిగి ఎలాగోలా మా వూరు చేరాలని నా ప్రయత్నం !"

ఆ సాక్ష్యాధారాలను చూడాలన్పించలేదు నాకు. జేబులోంచి అయిదురూపాయల నోటుతీసి అతనికిచ్చాను.

"థాంక్యూ సార్ ! కాంట్ యు స్పేర్ అనదర్ ఫైవ్ ?" అని అడిగాడు గాగుల్స్ పెట్టుకొంటూ.

"సారీ ప్లీజ్! ఐ హావ్ నో చేంజ్!" అన్నాను.

అతను నోటును జేబులో పెట్టుకొన్నాడు.

# మైనపు బొమ్మలు

"లెట్ మీ సీ దట్ ఫోటో !" అని అడిగాను.

అతను ఫోటో అందించాడు.

అందులో అతని ప్రక్కనున్న వ్యక్తిని చూడగానే ఆశ్చర్యపోయాను.

అనుమానం అక్కర్లేదు !

ఆమె కల్పన !

నా మెదడు పనిచేయటం ఆగిపోయింది. అసంకల్పితంగా ఫోటోను అతనికిచ్చి గబగబ ట్రయిన్ ఎక్కాను.

మనసంతా అల్లకల్లోలమైంది. లోపల గాలి లేదు. మరింత చిరాకు కల్గింది. ఫ్యాన్ స్విచ్ నేశాను. విండో తలుపు పైకెత్తాను.

బయట్నుంచి కొంచెం గాలి చల్లగా శరీరానికి తగలగానే రిలీఫ్ కల్గింది.

"రాస్కెల్ ! రాస్కెల్ ! బుద్ధి లేదు !" అంటూ కూపేలోకి అడుగుపెట్టాడు శేఖర్.

"ఎవరిని తిడుతున్నావ్ ?" అని అడిగాను అతని చేతిలోని అరటిపళ్ళను, ఏపిల్స్‌ను అందుకొంటూ.

"ఉన్నాడులే ఓ బెగ్గర్ ! పెళ్ళాం బిడ్డల ఫోటో చూపించి డబ్బులు అడుక్కొంటాడు !" అంటూ బెర్త్‌మీద కూర్చున్నాడు.

"వాడు నీకు తెలుసా ?" అని అడిగాను.

"అంటే నువ్వు కూడా వాణ్ణి చూశావా ? కొంపతీసి డబ్బులివ్వలేదు కదా ?"

"అయిదురూపాయిలిచ్చాను !"

"ఎంతసేపయింది ?"

"ఇప్పుడే !"

"అయినా వాడిమాటలు నువ్వెలా నమ్మావ్?"

"అనుమానించతగిన మనిషిలా లేడు !" అన్నాను మెల్లగా.

"అదే వాడి గొప్పతనం ! వాడేకాదు ఏ మనిషయినా ఈ కాలంలో అంతే! బాహ్యప్రవర్తనను బట్టి, మాటలనుబట్టి మనిషి వ్యక్తిత్వాన్ని అంచనా కట్టే రోజులు కావివి ! 'ఫేస్ యీజ్ ది యిండెక్స్ ఆఫ్ మైండ్' అన్నది పాత సూక్తి.

మనసులోని పగ, ద్వేషాలను, కల్లాకపటాలను, కుళ్ళను పైకి కన్పించకుండా జాగ్రత్తపడి సంఘంలో ప్రతి ఒక్కడు పెద్దమనిషి అన్పించుకోటానికే ప్రయత్నిస్తున్నాడు ఈ రోజుల్లో ! అందుచేత ఎవరు దొంగో, ఎవరు దొరో తెల్సుకోలేకపోతున్నాం !" అన్నాడు శేఖర్.

ఆ మాటలు నా గుండెలో వాడి శూలాల్లా దిగాయి. నా బాధను, కంగారును పైకి కన్పడనీయకుండా జాగ్రత్తపడ్డాను. నేను ఈ కాలపు మనిషినే కదా ! అనవసరమైన ఓ చిరునవ్వును పెదాలమీదికి తెచ్చుకొని "పో తే పో యిం ది లే ! అయిదు రూపాయలేగా !" అన్నాను.

"నీకు తెలీదు ఆనంద్ ! వాడిలా చాలామందిని మోసం చేస్తున్నాడు. అసలా పెళ్ళాం వుందో లేదో ఎవరికీ తెలీదు !"

"ఉంది !" అని గట్టిగా అరవాలనుకొన్నాను. కాని మళ్ళీ నాలోని మరో మనిషి నా నోరును నొక్కేసేడు. ఇంగ్లీషు మేగజైన్ చేతిలోకి తీసుకొంటూ అన్నాడు శేఖర్ —

"మా కజిన్ అనూ కూడా స్టేషన్‌కు వస్తానంది మనకు సెండాఫ్ యివ్వటానికి. నేనే వద్దన్నాను."

"ఎందుకని ?" అని అడిగాను పై బెర్త్‌మీదికి వెళ్తూ.

"ఆమె వస్తే నీవేమైనా ఫీలవుతావేమోనని వద్దన్నాను !"

నేను మాట్లాడలేదు.

"మా కజిన్ అని గొప్పలు చెప్పుకోటంకాదు గాని దానివన్నీ ఫార్వర్డ్ అయిడియాస్ ! దానికి సెల్ఫ్‌రెస్పెక్ట్ ఎక్కువ. తను మంచి అనుకొన్న దానిని చేయుటంలో వెనుకాడదు. ఎవరైనా ఏమైనా అనుకొంటారేమోనన్న భయం దానికిలేదు. నా నేచర్‌కు జస్ట్ ఆపోజిట్ ! పెళ్ళయ్యాక దాని సంగతి నీకే తెలుస్తుందిలే !"

ఆ సమయంలో శేఖర్ మాటలను వినాలన్పించలేదు. సాధారణంగా శేఖర్ కబుర్లు చెప్తుంటే ఎంతో సరదాగా వుంటుంది. తామిద్దరూ గంటల తరబడి కబుర్లతో గడిపిన రోజులు కోకొల్లలు. గుంటూరు ఆఫీసులో నాకు సన్నిహితుడైన వ్యక్తి శేఖర్ ఒక్కడే ! నా దగ్గరున్న చొరవచేతనే అతను తన కజిన్ అనూ గురించి చెప్పాడు. ఆమెకు వాళ్ళ తల్లిదండ్రులు సంబంధాలు చూస్తున్నారని నాతో అన్నాడు గుంటూర్లో. ఆ ప్రస్తావన యొక్క అంతరార్థం నాకు తెల్సు. అయినా నేను బయట పడలేదు. అతను చెప్పినదంతా శ్రద్ధగా వినసాగాను.

'ఎటూ ఆఫీసర్స్ ఇంటర్వ్యూకు మనిద్దరం మద్రాసు వెళ్తున్నాం కదా ! నీకు అభ్యంతరం లేకపోతే మా కజిన్ అనూను చూద్దువుగాని ! నీకు నచ్చితే మిగతా విషయాలు మీ పేరెంట్స్‌తో మాట్లాడతాను !' అన్నాడు.

నేను 'సరే' అన్నాను.

మా హెడ్ ఆఫీసులో ఇంటర్వ్యూ పూర్తిచేసుకొని శేఖర్ వాళ్ళ బాబాయిగారింటికి బయల్దేరాం! ఆయన ఏదో బ్యాంక్‌లో పని చేస్తున్నారట. టి. నగర్‌లో స్వంత ఇల్లు కూడా వుంది. మేము వెళ్ళగానే ఘనంగా మర్యాదలు చేశారు. అనుపమను పరిచయం చేశారు. అందంగానే వుంది. బి. ఎస్. సి. పాసయిందట. నాకు వయసు ఎక్కువని తెల్సికూడా నన్ను శేఖర్ ఎందుకు ప్రపోజ్ చేశాడో అని నేను వచ్చేముందు ఆలోచించాను. ఆ ప్రశ్నకు ఇప్పుడు సమాధానం దొరికింది. అనూ కూడా కొంచెం వయసు ఎక్కువే ? ఆ విషయాన్ని నేను అంతగా పట్టించుకోలేదు. నా ఆమోదాన్ని శేఖర్‌కు చెప్పాను. బహుశా అతను వాళ్ళక్కూడా చెప్పే వుంటాడు.

కొద్ది కాలంలోనే ఆఫీసర్‌ను కాబోతున్నాననే గర్వం, అందమైన అమ్మాయికి భర్తను కాబోతున్నందుకు ఆనందం నాలో అధికమై స్టేషన్‌కు వచ్చేవరకు వున్నాయి. అయితే కల్పన ఫోటో చూడగానే నా మూడ్ మారిపోయింది. మనసులో గర్వం లేదు ! ఆనందం లేదు ! ఏదో తీయని బాధ, తీరని ఆవేదన, పశ్చాత్తాపం నా మనసులో చోటు చేసుకొన్నాయి.

సర్కార్ ఎక్స్‌ప్రెస్ ఎవరితోను ప్రమేయం లేకుండా చీకట్లో పరుగులు తీస్తూంది

నాకు నిద్ర రావటంలేదు

మనసునిండా ఆలోచనలే!

నా ఆలోచనలు ట్రయిన్ కంటె వేగంగా పరిగెత్తుతున్నాయి కళ్లముందు గతం కదలాడింది

గుంటూరుకు రాకముందు నేను విజయవాడలో ఉద్యోగం చేశాను ఆ రోజు నాకు బాగా గుర్తు! శనివారం! పూజలు, పునస్కారాలు పూర్తయ్యేసరికి తొమ్మిదిన్నర దాటింది ఆఫీసుకు టైమయిందన్న తొందరలో హడావుడిగా సైకిల్‌మీద బయల్దేరాను

పది గజాలు వెళ్లానోలేదో హఠాత్తుగా నా సైకిల్‌కు బ్రేకులు పడ్డాయి

ఎదురుగా నేలమీద ఓ చిన్నకుర్రాడు పడిపోయి ఏడుస్తున్నాడు సమయానికి నేను బ్రేకులు వేయకపోతే చక్రం క్రింద పడివుండేవాడు సైకిల్‌కు స్టాండు వేసి కుర్రాణ్ణి ఎత్తుకొని సముదాయించాను అతని తాలూకు పెద్దవాళ్లు ఎవరైనా వున్నారేమో నని చుట్టూ చూశాను ఎవ్వరూ కన్పించలేదు కుర్రాడు ఏడుపు ఆపలేదు మెల్లగా సైకిల్‌మీద కూర్చోబెట్టి బెల్ మ్రోగించాను అతన్ని వినోద పర్చటానికి

ఏడుపును ఆపి తనుకూడా బెల్ కొట్టడానికి ప్రయత్నించాడు

'బాబూ! మీ యిల్లెక్కడ?' అని అడిగా

చేయెత్తి దక్షిణ దిక్కు చూపించాడు

# మైనపు బొమ్మలు

మెల్లగా సైకిల్ నడిపించుకొంటూ అటే వెళ్లాను

పది గజాల దూరం వెళ్లగానే 'బాబూ !' అంటూ ఒకామె ఎదురువచ్చింది

'అమ్మా ?' అంటూ చేతులు చాచాడు కుర్రాడు

కుర్రాణ్ణి ఆమెకు అందిస్తూ 'మీ అబ్బాయేనా?' అని అడిగాను

అవునన్నట్లు తలూపింది

'చిన్నపిల్లాణ్ణి అలా రోడ్డుమీద వదిలేస్తే ఎలాగండి ?' అన్నాను

'పొరపాటయిందండీ ! థాంక్సండీ !' అంటూ ఆమె వద్పుకొంటూ దగ్గర్లోనే వున్న ఓ ఇంట్లోకి వెళ్లింది

అదే నేను మొట్టమొదటిసారిగా కల్పనను చూడటం — వాళ్లిల్లు నేను ఆఫీసుకు వెళ్లే దార్లోనే వుంది ఆ రోజు లగాయితు ఆ ఇంటి ముందుకు రాగానే నా దృష్టి అటు ప్రక్కకే మళ్లటం అలవాటయిపోయింది ఆ అలవాటే అనర్థాలకు దారితీసింది రెండు చేతులు కలిస్తే కాని చప్పట్లు కావు ! నేను కల్పన ఇంటివైపు చూడటం, ఆమె కిటికీలోంచి నన్ను పరిశీలించటం ప్రారంభమైంది ఆమె చర్య నాకెంతో బలాన్నిచ్చింది కాలం గడుస్తున్నకొద్దీ ఆమెలోకూడా మార్పు రాసాగింది కిటికీలోంచి చూసేదల్లా తలుపులు తీసుకొని గుమ్మంలో నిలబడి చూడటం మొదలుపెట్టింది ఇక నేను పని వున్నా లేకపోయినా పదిసార్లు వాళ్లింటి వైపే వెళ్లేవాణ్ణి ఆమె ఎవరో, ఏంచేస్తుందో, తెల్సుకోవాలన్న తలంపు కల్గింది మార్గం కోసం అన్వేషిస్తుండగా అవకాశం గమ్మత్తుగా దొరికింది

ఓ రోజున వాళ్ల బాబు నా రూమ్‌కు వచ్చేసేడు 'మా అమ్మకు జొరం !' అన్నాడు ఏడుస్తూ నేను వెంటనే అతన్ని ఎత్తుకొని కల్పన వాళ్లింటికి వెళ్లాను ఆమె నిజంగానే మంచమ్మీద పడుకొని వుంది మనిషి నీరసంగావుంది ఇల్లంతా పరిశీలనగా చూశాను అద్దె ఇల్లు కావటంచేత చాలా ఇరుకుగానే వుంది ఆ గదిలో ఓ ప్రక్క మంచం, మరోప్రక్క బట్టలు కుట్టే మెషన్, రెండు కుర్చీలు వున్నాయి ఆ గదికి ఆనుకొనే కిచిన్ రూమ్ వున్నట్లుంది

'మీరా !' అంటూ లేచింది నన్ను చూడగానే

'ఫర్వాలేదు ! కూర్చోండి ! మీకు జ్వరంగా వుందని బాబు చెప్పాడు' అన్నాను ఆమె నా రాకను అపార్థం చేసుకొంటుందేమోనన్న భయంతో

'వీడు మీ యింటికి వచ్చాడా ? ఎంత జాగర్త ఏడుస్తున్నా రోడ్డుమీదికి పోతున్నాడు !' అంది కుర్రాణ్ణి ఎత్తుకొంటూ

'పసితనం కదండీ!' అన్నాను చిన్నగా నవ్వుతూ

'కూర్చోండి !' అంది కుర్చీవేసి

అలా ప్రారంభమైంది కల్పనతో నా పరిచయం

పరిచయం స్నేహంగాను, స్నేహం అనుబంధంగాను మారటానికి ఎక్కువకాలం పట్టలేదు ఆమె భర్తకు వుద్యోగం లేదని, నాటకాలపిచ్చి ముదిరి సినిమాపిచ్చి ప్రారంభమై మద్రాసు వెళ్లేవాడనీ, డబ్బువున్నంతకాలం అక్కడ వుంటాడని, డబ్బయ్యాక స్వంత వూరువచ్చి తండ్రిని పీడించి డబ్బు తీసుకు వెళ్లేవాడని, అందుచేత విజయవాడలో ఓ ప్రైవేటు కంపెనీలో అతనికి వుద్యోగం యిప్పించి, కల్పనను యిచ్చి పెళ్లి చేశారని, పెళ్లయి పిల్లాడు పుట్టినా అతని పద్ధతి మారలేదని, వీళ్లను వదిలేసి మద్రాసు వెళ్లిపోయాడని తన భర్త గురించి వివరంగా నాకు చెప్పింది కల్పన

కల్పనకు నాకు వున్నది కేవలం స్నేహబంధమే కాదు, శారీరక సంబంధం కూడా ఏర్పడింది ఆ విషయం మా వూళ్లోవున్న నాన్నగారికి తెల్సింది వెంటనే విజయవాడకు పరిగెత్తుక వచ్చాడు ఆయన ఏం చెప్పాడో కాని, కల్పన వారం తిరక్కుండానే ఇల్లు ఖాళీచేసి వెళ్లిపోయింది ఎక్కడకు వెళ్లిందో ఇప్పటికీ నాకు తెలీదు .

చటుక్కున లైటు వెల్గింది

శేఖర్ లేచినట్లున్నాడు

తలత్రిప్పి చూశాను

"ఇంకా నిద్రపోలేదా ? ఆ మైనపు బొమ్మ గురించే ఆలోచిస్తున్నావా ?" అన్నాడు సీసాలోని వాటర్‌ను గొంతులో పోసుకొంటూ

"మైనపు బొమ్మా, ఎవరు ?" అని అడిగాను అర్థంకాక

"వాడే ! ఇందాక ప్లాట్‌ఫామ్మీద కన్పడిన బెగ్గర్ మైనపు బొమ్మ చూడటానికి చాలా బాగుంటుంది కాని నిప్పుగాని వేడిగాని తగిలితే మొత్తం కరిగిపోయి ముద్దలా మారుతుంది వాడి అసలు స్వరూపం తెలీక అయిదు రూపాయలు అనవసరంగా పోగొట్టుకొన్నావ్ !" అన్నాడు శేఖర్ బెర్త్‌మీద నడుం వాలుస్తూ

"ఆఫ్టరాల్ అయిదు రూపాయిలే కదా ! డోంట్ వర్రీ !" అన్నాను

'నిజానికి మైనపు బొమ్మ కల్పన మొగుడు ఒక్కడే కాదు ? ఆర్థిక పరిస్థితులకు బానిసయై నాకు లొంగిపోయిన కల్పన, పరువుప్రతిష్టలను రక్షించుకొనే నిమిత్తం డబ్బును ఖర్చుపెట్టి కల్పనను వెళ్లగొట్టిన మా నాన్న, నైతికంగా దిగజారి పెద్దమనిషిలా ప్రవర్తిస్తున్న నేను — అందరం మైనపు బొమ్మలే !' అని మనసులో అనుకొన్నాను ఆ సమయంలో

కాని అదే సమయంలో శేఖర్ కూడా తన మనసులో 'అనూ జీవితంలో సురేష్ వలన మోసపోయినా ఆనంద్ లాంటి వ్యక్తి భర్తగా లభించటం ఆమె పూర్వజన్మ సుకృతం !' అని అనుకొన్నాడన్న విషయం అనుపమను పెళ్లి చేసుకొన్న ఆరునెలలకే నాకు తెల్సింది

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యంచిందే గట్టి పళ్ళు



# కోల్గేట్
## డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోమకుండి కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది



ఫలితం ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం దంతక్షయంనుండి రక్షణ

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

***నోటి దుర్వాసనను ఆపండి...***
***కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో***
***దంతక్షయాన్ని***
***ఎదుర్కోండి!***




DC G 74 TL

( గత సంచిక తరువాయి )

















గురుపుత్రునకు కీడు కలుగకుండ తనకు తనసోదరులకు శుభమును కాంక్షిస్తూ బ్రహ్మశిరంబున భిమంత్రించి వదిలాడు అర్జునుడు వారిరువురి దివ్యాస్త్రములు మంటలు గ్రక్కుచు భూనభోంతరములనిండి ప్రళయకాలంబును సూచించినవి







[ఇంకా ఉంది]

మీ స్నానమునందు ఒక క్రొత్తదనము నిచ్చు

సబ్బు - ప్రేమ్




సుకుమారమైన మీ చర్మ సౌందర్యమునకు ప్రేమ్
దీని పరిమళము స్వచ్ఛమైన నురగ మీ శరీరమును
ఆహ్లాదింపజేయును

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చు సబ్బు-ప్రేమ్






ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు

# అమ్మా, బాబుకి తగిలిన గాయంలో ఏకాస్త మట్టి చొరబడినా దాన్లో సూక్ష్మజీవులు చేరచ్చు



## సూక్ష్మజీవులు చేరకుండా రక్షించండి

**BAND-AID**
**BRAND**

## పట్టీలతో

తెలివిగల తల్లులు, రేగిన గాయాలలోకి సూక్ష్మజీవులు చేరకుండా బ్యాండ్-ఎయిడ్‌తో రక్షిస్తారు. ప్రతి బ్యాండ్-ఎయిడ్ పట్టీలో:

- మరింత సౌకర్యంతో, త్వరగా గాయాన్ని మాన్పడం కోసం, అతుక్కోని కొత్త పట్టీ ఉంది.
- పగిలిన చర్మాన్ని సరిచేయడంకోసం, ఋజువైన క్రిమి నిరోధక పదార్థం ఉంది.
- గాయం త్వరగా మానడానికి లోపలికి గాలిని చొరనిచ్చే సూక్ష్మ రంధ్రాలున్నాయి.

బ్యాండ్-ఎయిడ్ బ్రాండ్ ప్యాక్‌ను ఎప్పుడూ దగ్గర ఉంచుకోండి.




ఇది 25 మరియు 50 స్ట్రిప్స్ గల ప్యాక్‌లలో దొరుకుతుంది.

**Johnson & Johnson***



OBM/7975 TL

# నీకే తెలీని నీ మనసు

## పి.వి.ఆర్. శివకుమార్




శబ్దాల అడుగుల చప్పుడు పసిగడుతున్న జంతువులా చెవులు రిక్కించి, పిల్లిలా అడుగులు వేస్తూ గోడ దగ్గరకు నడిచింది ప్రమీల.

"వస్తాను డాలింగ్" అంటున్నాడు మూర్తి. ఆ వెనకే నాలుగు పెదవులు కల్సిన చప్పుడు చిరుసవ్వడి.

"ఊఁ.. ఇహపద" గోముగా అంటున్న శారద కంఠం.

"పద...పద...అని తరుముతావ్. నేను వెళ్ళిపోతే నీకు సంతోషమా ?"

"ఛీ ... ఏమ్మాటలమ్మా అవి ? మీ ఆఫీసుకే లైటయిపోతుందని అన్నాను గానీ..."

"వెధవ ఆఫీసు రిజైను గికేసి హాయిగా యింట్లో కూచుంటాను ఇరవయ్ నాలుగ్గంటలూ..."

"ఏం లాభం? అప్పుడు ఉదరపోషణార్థం నేను ఉద్యోగానికి బయల్దేరాలి !" శారద కిసుక్కున నవ్విన చప్పుడు.

"అంతేనంటావా ?"

"ఇంకేమంటాను ?"

"సరే వస్తా."

"వెళ్ళి రా !"

తలుపులు తెరుచుకున్న చప్పుడు.

"అన్నట్టు మర్చేపోయాను, మూర్తీ..." కంగారుగా పిల్చింది శారద.

"ఏమిటి ?"

"సాయంత్రం వచ్చేటప్పుడు పౌడర్ డబ్బా, ప్రింగుల పాకెట్, శృంగార్ కుంకుం ... మర్చిపోవద్దు."

"అలాగే"

మరు నిముషంలో పక్కవాటా ముంగిట్లో స్కూటర్ స్టార్ట్ చేస్తున్న శబ్దం వినిపించింది ప్రమీలకి.

"ఓయబ్బ ! వెధవ టెక్కు. దేశంలో ఇంకెవరూ పెళ్ళిళ్లే చేసుకోనట్టు, ఏ భార్యాభర్తలకీ మధ్య ప్రేమలే లేనట్టు..."

కసిగా విసుక్కుంది ప్రమీల.

"ప్రమీలా..." భర్త పిలుపు వినబడింది అంతలోనే.

"వస్తున్నా..." విసురుగా జవాబిచ్చింది. "ఏమిటి ? ఏంకావాలి ?"

"రాత్రి నా ఫైళ్ళు యీ టేబిల్ మీద పెట్టాను...కనబడవేం ?"

"సరిగ్గా చూస్తే అవే కనబడతాయి. రాత్రి బాబిగాడు మంచం మీంచి పడిపోకుండా రెండో దిండు అడ్డు పెట్టి, మీ ఫైళ్ళు తలకింద పెట్టుకున్నా !"

మంచం మీది దుప్పటి కింద నుంచి ఫైళ్లు తీస్తూ అంది ప్రమీల.

"ఖర్మ..." నుదురు మొత్తుకున్నాడు భార్గవ, "ఫైళ్ళు తలకింద పెట్టుకోవటమేమిటే నూనె మరకలూ ... పాడూ పడి తగలడి పోతాయి."

"దుప్పటి కింద పెట్టాక యింకా నూనె మరకలెలా ఔతాయ్ ?"

భార్గవ మరేం మాట్లాడకుండా, ఫైళ్ళు క్లిప్ చేసి, స్టాండ్ తీస్తూ అన్నాడు —

"వస్తాను."

"ఊఁ..." సైకిలు కదిలింది. ఇంజన్ ఆన్‌చేసి వున్న స్కూటర్ మీద మూర్తి, అతని పక్కనే నిలబడి ఏదో మాట్లాడుతున్న శారద కన్పించారు.

"హలో" అన్నాడు మూర్తి, భార్గవని చూస్తూనే.

"హలో" నవ్వుతూ చెయ్యి వూపి ముందుకి సాగిపోయాడు భార్గవ.

"ఛీ ... యీయన కసలు బుద్ధిలేదు." అనుకొంది ప్రమీల యింట్లోకి వెళ్తూ. వాళ్ళు కబుర్లు తరగనట్టు వీధిలో వికవికలు ... యీయన సిగ్గులేనట్టు చేతులూపడం !

కసినంతా వ్యక్తంచేస్తూ విసురుగా

## నీకే తెలిని నీమనసు

తలుపులు మూసి, దడాల్ని గడియపెట్టి లోపలికి నడిచింది.

* * *

ఇంతా చేసి నెలగోజులు పూర్తి కాలేదు శారదా, మూర్తీ ఆ వాటాలోకి దిగి. దిగిన మొదట్లో ఓ వారం, పదిరోజుల పాటు ప్రమీల బాగానే మాట్లాడింది శారదతో.

అయితే వచ్చిన పదిరోజులకే తెలిసింది శారద భర్తని పేరు పెట్టి పిలుస్తుందనీ, నువ్వు నువ్వని సంబోధిస్తుందనీ! మొదట్లో తన చెవుల్ని తనే నమ్మలేకపోయింది. ఒకటి రెండుసార్లు భర్తతో అంది

"ఏమండీ ఆ అమ్మాయి అతగాణ్ణి ఏక వచనంతో పిలుస్తుందల్లేవుందే"

భార్యకి యిలాటి విషయాల్లో ఇంటరెస్టు వుండదు. అతడికి ఎప్పుడూ ఆఫీసుగొడవలూ, లేదా తన బడ్జెటు లెక్కలూ సరిపోతుంటాయి. ఆఫీసు వారి పుణ్యమా అని పెద్ద వాటాలో అద్దెకి వుండగలుగుతున్నాడేగానీ, పదిహేను వందల జీతం వస్తున్నా అతడికి ప్రతినెలా రాబడిని మించిన ఖర్చు వుంటుంది. రెండెకరాల మెట్టని అంటిపెట్టుకుని పల్లెటూళ్లో సంసారం సాగిస్తున్న తండ్రీ, చదువుకుంటున్న యిద్దరు తమ్ముళ్లూ, ఓ చెల్లెలూ...వీళ్ల కోసం నెలనెలా నాలుగొందలు పైగా యింటికి పంపటం పెద్దకొడుకుగా అతనికో పెద్ద అబ్లిగేషన్. తనకో కొడుకు పుట్టగానే పితృధర్మంగా పలభై వేలకి ఇన్స్యూర్ చేసి పడేశాడు తన జీవితాన్ని. ఈ ఖర్చులు పోను మిగిలిన దాంతో సంసారం సాగించటం అతనికో అసిధారావ్రతం. ఈ వ్రతం జాగ్రత్తగా నిర్వహించటంలో యిరుగు పొరుగుల్ని అంత శ్రద్ధగా పరిశీలించటం అతడికి శక్తికి మించిన పని. అంతే కాక, యితరుల అంతరంగిక విషయాల్లో తల దూర్చటం తన సంస్కారానికి తగని పని అన్నది కూడా అతని నమ్మకం.

అయినా భార్య మాటలు విన్నాక అన్నాడు :

"ఏమో, పిలుస్తుందేమో! యీ రోజుల్లో సంస్కారానికి అదో గీటురాయి. ఫాషన్‌కి అదో చిహ్నం."

భర్త జవాబు వచ్చనట్లు మొహం చిట్లించి వూరుకుంది ప్రమీల.

క్రమంగా అమ్మలక్కల మధ్యాహ్నపు సమావేశాల్లో యీ అంశం చర్చకు రాసాగింది. ఆ అమ్మలక్కల సమావేశాలకి శారద రాక పోవటం, తన యింట్లో తను కూర్చుని ఏదో ఒకటి చదువుకోవటమో, యిల్లు సర్దుకోవటమో చేస్తూ పక్కింటిపురాణాన్ని పట్టించుకోకపోవటం సదరు సమావేశాల్లో యీ అంశం తీవ్రంగా చర్చితం కావటానికి మరింత దోహదం చేసింది. అమ్మలక్కలు నలుగురూ శారద వైఖరినీ, ఆమె భర్తని పేరు పెట్టి పిలవటాన్ని తీవ్రంగా దుయ్యబట్టసాగారు. దాంతో ప్రమీలకి శారదపై ఏర్పడిన వైముఖ్యం మరింత పెరిగిపోయింది. తన అక్కసుతో శారదతో మాట్లాడటం కూడా తగ్గించేసింది. అంతేకాక, భర్తకి తన అసంతృప్తిని వారానికి మూడుసార్లు ప్రోగ్రాం వేసుకుని నివేదించటం ప్రారంభించింది. ఓపిగ్గా విన్న భార్గవ, వివిధభారతి ప్రోగ్రాంలో ప్రతిరోజూ ఒకేపాట వినాల్సి వచ్చిన శ్రోతలా, వారపత్రికలో ప్రతి సంచికలోనూ ఒకే (రకం) కథ చదివిన పాఠకుడిలా విసుగెత్తి బోరెత్తిపోయి చివరికి పెళ్ళాన్ని గట్టిగా కసిరేశాడు.

"పోనిద్దూ. దేశంలో ఇంకే సమస్యా లేనట్టు నీకెందుకు వాళ్ళ గొడవ? అయినా అది యీ కాలపు ఫాషన్ అని చెప్పాను కాదూ?"

"బానేవుంది ఫాషన్. మొగుడిచేత కాళ్ళు కూడా పట్టించుకుంటుంది గాబోలు! అయినా దాన్ననేం లాభం? సభ్యతా, సంస్కారం తెలీని మనిషి. అతగాడి కుండాలి బుద్ధి. ఆడంగిరేకుల వాడిలా వున్నాడు బొత్తిగా..." అంది ప్రమీల.

"ఆవిడ సభ్యతా, సంస్కారాల గురించి విమర్శ చేసే ముందు మనం సభ్యతా, సంస్కారం నేర్చుకోవాలి. వాళ్ళ గురించి వాళ్ళ చాటున యిలా మాట్లాడుకోవటం సభ్యతేనా?"

"పోనివ్వండి. బియ్యే పాసయిన నాకు సభ్యత లేదు. ఇంటర్ మిణికిన ఆ మహాతల్లి దగ్గరే నేర్చుకుంటాను సభ్యతా — సంస్కారమూనూ! సరేనా?"

"చదువూ — సంస్కారం జంట పదాలే అయినా జంటగా వుండితీరాలన్న నిబంధన లేని అర్హతలు అవి! చదువుకోని వాళ్ళకి సంస్కారం వుండదన్న రూలూ లేదు — మొగుడు ఇష్టపడ్డప్పుడు, తన యిష్టం వచ్చినట్టు అతణ్ణి పిల్చుకునే ఆడదానికి సంస్కారం లేదన్నమాట నిజమూ కాదు" — తేల్చి పారేశాడు భార్గవ.

ప్రమీల కోపంతో ముక్కులు విగబిల్చింది—

"అయితే...అయితే...మమ్మల్ని పేరెట్టి పిలవమంటారా?"

"ఆవిడ వాళ్ళాయన్ని పిలుస్తోంది కాబట్టి నువ్వూ అనుకరించాలన్న అభిప్రాయంతో మాత్రం పిలవకు. నిజంగా నీకు మోజుంటే ఇదివరకే ప్రారంభించి వుండాల్సింది!" నవ్వాడు భార్గవ.

ఆ మాటలకి ఉడుక్కుంటూ, అక్కణ్ణుంచున్నదల్లా ప్రక్క గదిలోకి వెళ్ళిపోయింది, ధుమ ధుమ లాడుతూ ప్రమీల.

*  *  *

"తప్పకుండా వాళ్ళు లేచివచ్చిన బాపతే అయి వుంటారు."

వారం రోజుల తర్వాత ఓ రాత్రివేళ, భోంచేస్తున్న భర్తతో వుండబట్టలేక అనేసింది ప్రమీల.

"ఛ ... ఎందుకలా అంటున్నావ్?" నోట్లో పెట్టుకోబోతున్న ముద్దని అలాగే పట్టుకుని ఆశ్చర్యంగా అడిగాడు భార్గవ.

"ఆవిడ మెళ్ళో మంగళసూత్రం కూడా లేదు! ఓ ఒంటిపేట గొలుసుంటే అదే సూత్రమేమో అనుకున్నా యిన్నాళ్ళూ! కాదని తేల్చిపోయింది యివాళ! సవ్యంగా పెళ్ళయిన వాళ్ళయితే మంగళసూత్రం ఎందుకుండదూ?"

భార్గవకి కొంచెం వింతగానే తోచింది యీ మాట. భర్త మాట్లాడక పోవటం చూసి ధైర్యంగా కొనసాగించింది ప్రమీల—

"మీరంత్తొ ప్రమిలాలోకం గానీ, మొగుణ్ణి పేరెట్టి పిల్చినప్పుడే అనుకున్నాను నేను! సవ్యంగా కాపురాలు చేసుకునే వాళ్ళెవ్వరూ అలా పిల్చుకోరు! కనీసం నలుగురూ వింటు న్నారనయినా వుండదు గాబోలు!

అందుకే నలుగుర్లోకి రావటానికీ, కలివిడిగా వుండటానికీ కూడా జంకుతోంది! పెద్ద టెక్కుమనిషిలా యింట్లోనే పడుంటుంది భర్త లేనంతసేపూ!"

"పోనిద్దూ-పొరుగు వాళ్ళని గురించి మనకి సంబంధించినంత వరకూ చెడుగా మాట్లాడుకోవటం మంచిది కాదు. వాళ్ళ అలవాట్లు, అగచాట్లు వాళ్ళని నడవనిచ్చి మనం మౌనంగా వూరుకుంటే పోలా!" అన్నాడు భార్గవ.

*  *  *

"వదినగారూ... వదినగారూ!"

రాత్రి పది గంటలు దాటుతున్న వేళ... కంగారుగా వినిపించింది శారద కంఠం.

అంత క్రితమే లైటు తీసేసి పక్కమీదికి వాలాడు భార్గవ. ప్రమీల పడుకుని పావుగంట దాటుతోంది.



## నీకే తెలిని నీమనసు

శారద పిలుపు వినబడ్డ భార్గవ భార్యని లేపుదామని భుజంమీద చెయ్యివేసి తట్టాడు.

"నేనేం నిద్ర పోవటం లేదుగానీ మీరు వూరుకోండి ఏమంత మునిగిపోయేపని అర్ధరాత్రివేళ యింతోటి మరదలుగారికి!..."

"ఏం మాటలవి? అవసరం వచ్చిందో ఏమో, పాపం. లేచి వెళ్లి చూడరాదూ?"

"నా దంత జాలి గుండేం కాదు. కావా లంటే మీరెళ్ళి చూడండి."

భార్గవ విసురుగా లేచి వెళ్ళి, నెమ్మదిగా తలుపు తీసాడు. అతణ్ణి చూసి శారద రెండడుగులు వెనక్కి తగ్గింది.

"ఆయనకి బాగా జ్వరం వచ్చిందండీ, ఒళ్ళు పేలిపోతోంది" అంది. గొంతు తడిగా ధ్వనించింది కళ్ళ అప్పటిదాకా ఏడ్చినట్లు వుబ్బి ఉన్నాయి. "అరె... ఎప్పట్నుంచి? ఇవేళ ఆఫీసుకి వెళ్ళినట్టున్నారే?" అన్నాడు భార్గవ, ఆదుర్దా కనబరుస్తూ.

"ఉదయమే కాస్త వొళ్ళు వెచ్చగావుంా లెక్కచెయ్యకుండా వెళిపోయారు. సాయంత్రం వస్తూనే తలనొప్పిగా వుందని పడుకుండిపోయారు డాక్టర్ దగ్గరికి వెళ్ళమంటే అదే తగ్గుతుంది లెమ్మని రెండు క్రోసిన్ టాబ్లెట్స్ మింగి వూరుకున్నారు. అరగంట క్రితం మంచీ మరీ ఎక్కువైంది. మూలుగుతున్నారు... నా కేమిటో భయంగా వుంది అన్నయ్యగారూ!" శారద కళ్ళలో మళ్ళీ నీళ్ళు తిరిగాయి

భార్గవకి జాలి కలిగింది.

"మరేం ఫర్వేదమ్మా జ్వరం వింతలో తగ్గుతుంది? నేను వెళి డాక్టర్ని పిలుచుకు వస్తాను. మవ్వు ఆయన్ని కనిపెట్టుకు వుండు" అంటూ గబగబ చొక్కా వేసుకుని బయటకు నడిచాడు. శారద తమ వాటాలోకి వెళ్ళిపోయింది.

"చూశారుగా! ఇంట్లో ఆడదాన్ని వుండగా నాతో ఒక్కమాట చెప్పలేదు. మీతో పని కాబట్టి మీతో మాట్లాడి వూరుకుంది. సభ్యతంటే యిదేగాబోలు! అయినా అంత ఫాషన్ల మోడన్ మనిషిగా – వెళ్ళి డాక్టర్ని పిల్చుకోలేదూ?"

తిరిగొచ్చిన భర్తతో అంది ప్రమీల.

భార్య మొహంలోకి ఒక్కసారి సీరియస్‌గా

చూసి, కళ్ళు మూసుకుని పక్కకి తిరిగాడు భార్గవ

*   *   *

"ఏమిటి కథ? రెండ్రోజులనించి వాళ్ళ యింట్లోంచి అయిదు నిమిషాల్లో వచ్చేస్తున్నావ్ - పని వుండటం లేదా?" ప్రమీల పని మనిషిని అడిగింది

"ఏం పనమ్మా? ఆ అయ్యకేమో జ్వరంగా వుందట—ఆయమ్మ అన్నమే వండుకోవటంలేదు కాఫీలు తాగిన గ్లాసులు, గిన్నెలు తప్ప మరేం వుండట్లేదు" అంది పని మనిషి

"ఓయబ్బ! మొగుడికి జ్వరమొస్తే భోజనం కూడా మానుకుంటారు గాబోలు! ఊరి వాళ్ళకి బడాయి పోవటం తప్పితే ఏమిటి?" అనుకుంది ప్రమీల

"ఏమండీ — యిది విన్నారా? అతగాడికి జ్వరంగా వుందని ఆ శారద తిండి కూడా మానేసిందట" సాయంత్రం భర్తకి కాఫీ యిస్తూ అంది

"నిజమే పొద్దున డాక్టర్‌గారితో కలిసి వెళ్ళినప్పుడు నాతో అని బాధపడ్డాడతను. 'నేనెంత చెప్పినా వినటం లేదండీ, వంట కూడా మానుకుంది రెండ్రోజుల్నుంచీ' అని! అతడితో పాటుగా తనూ బ్రెడ్డో, పళ్ళరసమో తాగి వూరుకుంటోందిట!" అన్నాడు భార్గవ

"ఏహనేం అలా చెప్పండి సాగితే జ్వరమంత సౌఖ్యం లేదన్నారు అందుకే! పళ్ళూ, పాలూ, బ్రెడ్డూ తింటుంటే ఇహ అన్నం కూడా ఎందుకూ? కొనిపెట్టే భర్త వుండగా వంటయింటి చాకిరీ రెండ్రోజులు తప్పినా తప్పినట్టే! ఊరి వాళ్ళకేమో గొప్ప పతివ్రతావతారంలా వేషం!"

"ఆవిడొచ్చి తను మొగుడి మీది ప్రేమ కొద్దీ తిండి మానుకున్నానని నీతో చెప్పిందా? ఎందుకే ఆవిడంటే నీకంత మంట?"

"పోన్లెండి ఆవిడ మంచిదే! నేనే గయ్యాళి దాన్ని గనక అందర్నీ ఆడిపోసుకుంటాను సొంత చెలెలి కన్న ఎక్కువగా వెనకేసు కొస్తున్నారు! ఆవిడ గర్వం, డాబుసరి తనం మీకేం తెల్సు" మూతి తిప్పుకుంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయింది ప్రమీల

*   *   *

"చాలా థాంక్సండీ నిజంగా మీరు బాగా శ్రమ తీసుకున్నారు నా గురించి" అన్నాడు మూర్తి

"భలేవారే! పొరుగువాళ్ళం ఆపాటి సాయపడకపోతే ఎలా? రేపు నాకేదయినా వస్తే, మీరు మాత్రం"

"పూరుకోండన్నయ్యగారూ — అటువంటి పాడు మాటలు విప్పారు అనకండి" చటుక్కున అతణ్ణి కట్ చేస్తూ అంది శారద

"ఫర్వేదమ్మా, మాట వరసకన్నాను అయినా మీ ఆయనకి అంటి శ్రమ ఎప్పుడూ కలిగించనులే! నాది రాతి శరీరం" నవ్వుతూ అన్నాడు భార్గవ

"అదిగో మళ్ళీ! అన్యాపదేశంగా అలాటి మాటలే అంటున్నారు" అంది శారద ఈసారి మూర్తి కూడా నవ్వేడు భార్గవతో పాటు

*   *   *

వంద మైళ్ళ దూరంలో వున్న పట్టణంలో ప్రమీల అన్నగారుండగా బారసాల బారసాలకి వెళిన చెల్లెళ్ళు రెండ్రోజులు వుండి వెళమని బలవంతం చేశాడు ఆమె అన్న భార్యని కొడుకుని అక్కడ వదిలి, ఆఫీసు పోతుందని ఆ సాయంత్రమే తిరిగి వచ్చేశాడు భార్గవ

వంటరిగా చెయ్యి కాల్చుకుంటున్న భార్గవని బలవంతాన తమ యింటికి లాక్కొచ్చాడు మూర్తి భోజనాలు చేసి, కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు ముగ్గురూ

"పై వారం రెండ్రోజులు శెలవలొచ్చాయి కదా! మేం టెస్కోం పిడిక్కి పిక్నిక్ వెళ్దామనుకుంటున్నాం మీరూ రాకూడదూ?" అడిగాడు మూర్తి

భార్గవ ఏం మాట్లాడలేకపోయాడు భార్య ఒప్పుకోదన్న భయం అతనికుంది. అరనిముషం ఆగి అన్నాడు -

"నేనెందుకూ, మీ యిద్దరూ సరదాగా వెళ్ళిరండి చిలకా గోరింకల్లా"

"పిక్నిక్కి చిలకా గోరింకా ఏమిటండీ, పిచ్చి? నలుగురం వుంటేనే సరదా!" అన్నాడు మూర్తి

"అదికాదు మూర్తీ — వదినగారికి నాతో రావటం యిష్టం వుండదు అదీ సంగతి" చిన్నగా నవ్వుతూ చెప్పింది శారద

సిగ్గుతో తల దించుకున్నాడు భార్గవ

"నాన్సెన్స్ రబ్బిష్, శారూ!" చిరుకోపంగా అన్నాడు మూర్తి

"నో నో శి యిట్ ఈజ్ ట్రూ మా ఆవిడ గ్రాడ్యుయేట్ అయినా, స్త్రీ సహజ గుణాలకి పూర్తిగా బానిస! ప్రయత్నించి ఆమెని మార్చలేకపోయాను నా అప్పటికి లో అనగంజంతయినా మార్పు రాలేదు!" కించిత్ బాధగా బయటపడ్డాడు భార్గవ.

"సరే మిమ్మల్ని అంచనరంగా"



"ఫర్వాలేదు. పిలవడం మీ కర్టెసీ. రాలేక పోవటం మా బాడ్‌లక్ "

"అంత మాటెందుకు లెండి ? మాతో రాలేకపోయినంత మాత్రాన బాడ్ లక్ ఏముంది ? అయినా, వదినగారే కాదు, యీ వీధిలో చాలా మందికి నేనంటే పడదు నేను భర్తని గౌరవించననీ, ఆడవాళ్ళందరితోనూ కలిసి కబుర్లు చెప్పననీ " శారద అంది

"నిజం చెప్పాలంటే మా శారద నన్ను చనువుగా పిలవటానికి కారణం ఆధునికతా, పాడూ కాదు! చిన్నప్పటినించీ అవిభక్త కుటుంబంలో ఒకే యింట్లో పెరగటంతో మేనత్త మేనమామ పిల్లలమైన మేం మన్వంటూ పేర్లు పెట్టి పిల్చుకోవడానికీ, ఆడుకోవడానికీ అలవాటు పడిపోయాం. ఒక్కసారిగా ఆ అలవాటు మార్చుకోవాలని ప్రయత్నించీ పెళ్ళయిన కొత్తల్లో శారద చాలా యిబ్బంది పడేది దాంతో నేనే ఆమెని వద్దని వారించేశాను " చెప్పాడు మూర్తి నవ్వుతూ

"నేను మంగళసూత్రం వేసుకోవట్లేదని కూడా అందరికీ ఓ అనుమానం అన్నయ్యగారూ— పోనీ, ఆ అనుమానం వున్నవాళ్ళు నేరుగా నన్ను అడుగుతారా అంటే అదీలేదు వాళ్లంతట వాళ్ళే ఏదో ఒక వూహ చేసుకోవటం, అభాండాలు ప్రచారం చేయటం చేస్తారు! నన్ను అడగని వాళ్ళకి నే నెందుకు సంజాయిషీ చెప్పాలీ అన్న పంతం నాది!

మాకు పెళ్ళయి ఆరు నెలలు తిరక్కుండానే ఆయనకు పెద్ద జబ్బు చేసింది చివరికి పరిస్థితి డాక్టర్లు కూడా పెదవి విరిచేసే వరకూ వెళ్ళింది ఏదారీ తోచక, "భగవంతుడా, నీకు నా మాంగల్యమే కావాలంటే అది ఇప్పుడే ఇచ్చేస్తాను ఆయన్ని మాత్రం నా నుంచి దూరం చేయకు" అని వేడుకున్నాను. ఆ దేవుడి దయవల్లే ఆయన కోలుకున్నారు. వెంటనే నేను నా మంగళసూత్రం తీసేశాను

సెంటిమెంట్ కావచ్చుగానీ నా నమ్మకం అది మరి !"

ఉద్రేకంగా చెప్తున్న శారద కళ్లు కూడా చెమర్చి, ఇరుగు పొరుగుల మాటలు ఆమె నెంత బాధించాయో తెలియ జెప్పాయి.

"ఇవన్నీ కారణాలే గానీ, యీ వీధి ఆడవాళ్ళకి మన్వంటే పడకపోవటానికి వున్న

## నీకే తెలిని నీమనసు

అసలయిన ముఖ్య కారణం మరొకటమ్మా— అదే అసూయ !

నువ్వూ, మూర్తీ అన్యోన్యంగా వుంటున్నారు మీకు స్కూటరుంది ప్రతిరోజూ షికారు కెళ్తారు మీ యింట్లో డ్రైనింగ్ టేబిలుంది, ఫ్రిజ్ వుంది ఆధునిక సామగ్రి అంతా వుంది! ఇద్దరు మనుషుల కోసమే అయినా యింత పెద్ద యిల్లు వుంది!

ఇవేనీలేని మిగతా వాళ్లందరికీ యిందుకే మీమీద అసూయ వుంది !

ఇన్నీ తెలిసీ నేను కనీసం ప్రమీలనయినా మార్చలేకపోతున్నానన్నదే నా బాధ !"

అన్నాడు భార్గవ సిగ్గుపడుతూ

* * *

దాదాపు నెలరోజులు గడిచిపోయాయి! ఓ ఆదివారం ఉదయం

**★ సత్యం ★ జ్ఞానం ★ అనంతం ★ బ్రహ్మ ★**

అడుగడుగున జీవితం
అందమైన జీవితం
అంతులేని సంపదవలె
అన్నిచోట్ల నిండివుంది !
అడుగడుగున సాహిత్యం
అందమైన సాహిత్యం
అంతులేని సంపదవలె
అన్నిచోట్ల నిండివుంది !
అడుగడుగున ఆనందం
అమృతమయ మానందం
అంతులేని సంపదవలె
అన్నిచోట్ల నిండివుంది !
సత్యమే జ్ఞానమని
జ్ఞానమే అనంతమని
అనంతమే బ్రహ్మమని
బ్రహ్మమే అనంతమని
ఈ నాలుగె నాల్గు వేదసారమని
అదియే ఆనందమని
రూఢిగా తెలుసుకో !
తెలివి గలిగి మేలుకో !
జ్ఞానివిగా మనుకో !

"హృదయం"

తిరిగొచ్చి కూర్చుని కాఫీ తాగుతున్న భార్గవ, ప్రమీల పక్కవాటాలోంచి వినవచ్చిన మాటలకి ఉలిక్కిపడ్డారు

"రోజురోజుకీ మారిపోతోంది నీ వరస ! ఏమిటసలు నీ అభిప్రాయం ?" తీవ్రంగా వుంది మూర్తి ఉచ్చ స్వరం

"మారిపోతున్నది నా వరసా ? నీ వరసా?" శారద కూడా గట్టిగానే అడిగింది

"నీకు సంజాయిషీ యిచ్చే అవసరం నాకు లేదు షెల్ విత్‌యు "

ఆ మాటలు వినపడ్డ కొద్ది క్షణాలకే బయట స్కూటర్ చప్పుడు మొదలై క్రమంగా దూరమయిపోయింది

ఆశ్చర్యంగా ముఖాముఖాలు చూసుకున్నారు ప్రమీలా, భార్గవా

* * *

నాలుగురోజులు గడిచాయి రాత్రి పది గంటలవేళ భార్గవ, ప్రమీల భోజనాలు ముగించి అప్పుడేపక్కమీద వాలారు కాలింగ్ బెల్ బయట ఆగకుండా మోగసాగింది—పక్కవాటాలో శారద వెళ్ళి తలుపు తీసేదాకా ఆ చప్పుడు అలాగే సాగింది

రెండు నిమిషాల్లో అరుపులు వినిపించాయి

"డోంట్ బి ఫూలిష్ శారదా ! నన్ను విసిగించకు తాగుతానో, క్లబ్బుల్లో కాపరం పెడతానో నా యిష్టం నా డబ్బు — నేను ఖర్చు చేసుకుంటున్నాను తెలివి తక్కువగా ప్రవర్తించి నాకు దూరం కాబోకు "మూర్తి మాటలు తాగివచ్చినట్లుగానే తూగుతున్నాయి!

"తాగొచ్చాడంటారా ?" ఆశ్చర్యంగా అడిగింది ప్రమీల

"ఏదేనా పార్టీ అయిందేమో !" అన్నాడు భార్గవ, అతనికీ ఆశ్చర్యం కలిగినా

కానీ, రాను రాను అటువంటి సంఘటనలు, భార్యా భర్తల మధ్య ఘర్షణలు సాధారణమై పోయాయి పక్కవాటాలో ప్రమీల, భార్గవ ఆశ్చర్యానికి లోనైనా తామెలా కల్పించుకోవాలో అర్థంకాక వూరుకున్నారు

ఆ రోజు సాయంత్రం ఆఫీసునించివస్తూనే శారద తమ వాటాలోంచి వెళ్ళటం చూసి ఆశ్చర్యపడ్డాడు భార్గవ

"ఏమిటో విశేషం— ఆవిడ మనింటికి వచ్చిందే?" అన్నాడు.

"నేనే పిల్చాను యిందాక. ఏమీ తోచ



# హై పవర్ సర్ఫ్
# అమిత తెల్లగా ఉతుకుతుంది...
## అమిత తెల్లగా, కనువిందుగా.

మీ బాబు బట్టలు మురికి చేసుకోవడంలో ఘటికుడా? ఆ మురికి వదల గొట్టడానికి మీకూ ఘనమైనదే కావాలి మరి అదే హై పవర్ సర్ఫ్

హై పవర్ సర్ఫ్‌లో ఉంది అతి శక్తివంతమైన ఫార్ములా దానిలోని హెచ్చు ఉతికే శక్తి మురికినీ, జిడ్డు మరకల్ని మటుమాయం చేస్తుంది. బాగా మాసిపోయిన దుస్తుల్ని కూడా తెల్లగా మిలమిల మెరిసేలా చేస్తుంది సర్ఫ్ సర్ఫ్ రంగు బట్టలకు కూడా మంచిది వాటిని పరిశుభ్రంగా, కాంతివంతంగా ఉంచుతుంది ఇంటిల్లిపాది బట్టలకూ ఉతుకులో అదనపు తెల్లదనం, కాంతీ ఇస్తుంది హై పవర్ సర్ఫ్ ఎక్కువ మంది తల్లులు మరే ఇతర వాషింగ్ పౌడర్‌కు బదులు సర్ఫ్‌నే వాడటంలో మరి ఆశ్చర్యం ఏముంది గనక?




**ఎక్కువ మంది తల్లులు మరే ఇతర వాషింగ్ పౌడర్‌కు బదులు సర్ఫ్‌నే వాడతారు**

కుండా కూర్చుని ఏడుస్తోంది వక్కర్తీ. మన బాబుని ముద్దు చేస్తూ కూర్చుంది!" అంది ప్రమీల

ప్రమీలలో శారదపట్ల వస్తున్న మార్పు గమనిస్తున్నట్టుగా భార్గవ కళ్ళెగరేశాడు

*　　*　　*

రానురాను పరిస్థితి మరింత దిగజారింది. మూర్తి దాదాపు ప్రతిరాత్రీ తాగి, ఆలస్యంగా యిల్లు చేరటం, అర్ధరాత్రి భార్యాభర్తల మధ్య సరసాలకి బదులు సంఘర్షణలు చెలరేగటం - ప్రతి ఉదయం పనిమనిషి గిన్నెడు అన్నం తీసుకుపోవటం జరుగుతోంది

"ఆ మొగుడి పుణ్యమా అని శారద ప్రతి రాత్రి భోజనం మానుకు పడుకుంటోందిట!' అంది ప్రమీల భర్తతో, పనిమనిషి నుంచి సేకరించిన వివరాలు ఆధారంగా. భార్గవ క్కూడా ఆమె మీద జాలి కలిగింది

*　　*　　*

ఆదివారం. ఏదో పుస్తకం చదువుతూ నిద్రలోకి జారుకున్న భార్గవకి నాలుగ్గంట లవుతుండగా మెలుకువొచ్చింది. హాల్లో ఆడవాళ మీటింగు జరుగుతోంది కాబోలు- మాటలు వినిపిస్తున్నాయి

" మరీ అన్యాయమండీ! ఎప్పుడో ఒకసారంటే, ఏ మగాళయినా తాగుతారు. అతను రోజూ యిదే వరస అయిపోయింది కదా!"

"పాపం, ఆవిడని చూస్తే జాలేస్తోంది. రోజూ సాయంత్రమయ్యేసరికి నూట్కొరెక్కి హుషారుగా షికార్లకి వెళ్ళేది! ఇప్పుడసలు ఏ పొద్దూ బయటికి వస్తున్నట్టు లేదు"

"ఏ వేళలో చూసినా ఆడవాళ్ళకే ముద్దొచ్చేలా అలంకరించుకుని కనిపించేది. అలాంటిది, యిప్పుడసలు తల కూడా సరిగ్గా దువ్వుకుంటున్నట్టు లేదు ఎప్పుడు చూసినా మాసిపోయిన చీరెతో, దిగులు కమ్మిన మొహంతో కన్పిస్తోంది"

ఆడవాళ్ళంతా శారద మీద కురిపిస్తున్న సానుభూతి కబుర్లు వింటుంటే, భార్గవకి పేలవమైన నవ్వు పెదాల మీద మెదిలింది.

'మొన్నటిదాకా ఆమెని ఆడిపోసుకున్నది వీళ్ళు కాదూ ?'

మంచం మీంచి లేచి మరచెంబులోంచి గ్లాసులోకి మంచినీళ్ళు ఒంపుకు తాగాడు. అతడు లేచిన అలికిడి విని ప్రమీల లోపలికి వచ్చింది, "లేచారా ?" అంటూ

మీటింగు ముగించుకుని వెళ్ళిపోయారు అంతా

ప్రమీల యిచ్చిన కాఫీ తాగుతూ ఆలోచనలో పడ్డాడు భార్గవ

"మూర్తి ఎందుకు యింతలా మారి పోయాడు ?"

లేచి ముఖం కడుక్కుని, చొక్కా తొడుక్కుని పక్కవాటాలోకి నడిచాడు

ముందు గదిలోనే కూర్చుని వున్నాడు మూర్తి - పేపర్ తిరగేస్తూ భార్గవని చూస్తూనే- 'రండి రండి " అన్నాడు

కాసేపు ఏవో పిచ్చాపాటీ నడిచాక, అసలు విషయంలోకి వచ్చాడు భార్గవ

"మీరేమీ అనుకోనంటే, ఒక విషయం అడుగుతాను"

"అడగండి"

"ఈ మధ్య ... మీలో ఏదో మార్పు కన్పిస్తోంది..."

మూర్తి ముఖం ఒక్కసారి వెల్లబడింది. జవాబేం చెప్పకుండా ఎటో చూస్తూ వూరుకున్నాడు

"అయాం సారీ, మీ వ్యక్తిగతవిషయాల్లో అనవసర జోక్యం కల్పించుకుంటే ..." ఇబ్బందిగా అన్నాడు భార్గవ

"నో నో .. మీరు నాకు అన్న లాంటివారు మీ సంస్కారం నాకు తెల్సు అందుకే సిగ్గుపడుతున్నాను—మీ చేత ఇలా అడిగించుకోవలసిన పరిస్థితి వచ్చినందుకూ, మీకు సంజాయిషీ చెప్పుకునే స్థితిని తెచ్చుకున్నందుకూ".

ఆ తర్వాత నెమ్మదిగా వివరించాడు.

మూర్తి నడుపుతున్న ఏన్సిలరీ యూనిట్ యిటీవల అన్ని విధాలా దెబ్బతినసాగింది. భాగస్థుడుగా వున్న మిత్రుడు అతడిని మోసగించి మెటీరియల్ అమ్ముకోవటంతో పాటు, బాంక్‌కి తీర్చవలసిన అప్పుల్ని తీర్చకుండా తన ఖర్చులకి వాడుకోవటం, నొక్కేసుకోవటం చేయసాగాడు. చివరికి ఏవేవో లావాదేవీలు ఏకరువు పెట్టి తను పూర్తిగా తప్పుకుని మూర్తిని కోర్టు కేసుల్లో కూడా యిరికించి వదిలిపెట్టాడు ప్రస్తుతం యూనిట్ మూసివేయాల్సిన పరిస్థితి ఏర్పడింది!

ఇప్పుడు...
అందానికి ఒక కేలమైన్

# పాండ్స్
## కేలమైన్ లోషన్

**పూసిన అందం,
సంరక్షించే గుణం,
తాజా మురిపెం,
మీ చర్మానికిది లాభమయం.**

చర్మానికి ఆరోగ్యంతోబాటే అది ఒక అందాల గని కావాలని కోరుకోరామరి ? ఈ రెంటి కోసమూ యిదుగో కొత్త పాండ్స్ కేలమైన్ లోషన్ :
మచ్చలేని, నిర్మలమైన శోభ, చల్లదనం యిక మీ వంటిపైన—గాలిలోని, సంతోషం విరిసే, మారని ఆ తాజాదనం. మేకప్ వేసుకునే ముందైనా, లేదా దానంతట అదిగానే వాడటానికి వీలు సుగంధం విరజిమ్మే, అందాన్నిచ్చే పాండ్స్ కేలమైన్ లోషన్




పాండ్స్

# నీకే తెలీని నీమనసు

సజావుగా నడుస్తున్న బిజినెస్ మూతపడి, ఒక్కసారిగా పరిస్థితులు ఎదురు తిరగటంతో వున్నదంతా అందులోనే పెట్టి, దానిమీదే ఆధారపడి వున్న మూర్తి అకస్మాత్తుగా తల కిందులు కాక తప్పలేదు దాంతో ప్రతి పనిమీద విసుగు, కోపం మనస్తాపం మర్చి పోయేటందుకు తాగుడు ఎక్కువైపోయాయి! శారదని కసరటం, తిట్టటం అప్పుడప్పుడు చెయ్యి చేసుకోవటం దాకా కూడా వెళ్ళింది!

అన్నీ ఫ్రాంక్‌గా చెప్పి చివరికి అతనే అన్నాడు -

"తీరిగ్గా కూర్చుని ఆలోచిస్తే, నాకే ఎంతో సిగ్గుగా వుంది అన్నగారూ, ఎందులోనన్నా దూకి చావాలనిపిస్తోంది బట్ - శారద ఋష్యాడు పట్టేమనిషి కూడా కాదు తనని, ఫట్టబోయే సంతానాన్నీ గాలికి వదిలి వెళ్లలేక చూస్తున్నాను"

మగాడు అంతలా దిగజారి మాట్లాడా డంటే, ఎంత గొప్ప దెబ్బని ఎదుర్కొంటు న్నాడో అర్ధమయింది భార్గవకి

ఓపిగ్గా అరగంటసేపు మూర్తికి ధైర్యం చెప్పి, ఆపదలందు ధైర్యగుణం ఎంత అవసరమో నూరిపోసి, పరిస్థితుల్ని ఎదుర్కో నేందుకు మర్నాడు తన మిత్రుడైన ఓ పేరు మోసిన లాయర్ని కలుద్దామనీ, అతని సహాయంతో యీ క్లిష్ట పరిస్థితి నుంచి బయట పడటం ఏమంత కష్టం కాబోదనీ నచ్చచెప్పి తిరిగొచ్చాడు భార్గవ

"ఏమంటాడు ?" నిరసనగా అడిగినా, ప్రమీల కంఠంలో ఆత్రుత తొంగి చూడనే చూసింది విషయం వివరించాడు భార్గవ

"ఆఁ బడాయి, వ్యాపారాలు తగలబడి పోయిన వాళ్లంతా యిలాగే ప్రవర్తిస్తున్నా రేమిటి ? అతగాడి మనస్తత్వమే అలాంటిది! ఆ శారద దురదృష్టం ఇలావుంది కష్టాల్లోనే మనిషి అసలు రంగు బయట పడుతుందిట ! అతని మంచితనం వెనకనున్న రూపం ఇదన్న మాట! పాపం ఆ శారద ఎంత బాధ పడుతోందో."

ఇంకా ఏవేవో అంటోంది ప్రమీల. కానీ జవాబివ్వకుండా లోపలికి వెళ్ళిపోయాడు భార్గవ.

అతని ఆలోచనలు మరోవైపుకి మళ్ళాయి హఠాత్తుగా.

'తమ మనసుల్లో ఏముందో తమకైనా తెలుసా యీ ఆడవాళ్ళకి ?

సుఖంగా వున్నన్నాళ్లూ శారదని ఆడిపోసు కున్నారు ఇవేళ ఆమె కష్టాల్లో వుంటే - తమ కన్న తక్కువ స్థాయికి పడిపోయిందన్న సంతృప్తితో - ఆమె మీద ఎక్కడలేని సానుభూతినీ వలకబోస్తున్నారు !

రేవతని వ్యాపారం మళ్ళీ బాగుపడొచ్చు వాళ్ళు పండంటి పాపాయితో, సుఖంగా, సరదాగా మంచి మలుపులోకి జీవితాన్ని మళ్ళించుకోవచ్చు

అప్పుడు మళీ యీ ఆడవాళ్ళంతా చేరి- 'అబ్బో - ఏం విడిపడుతోందో - ఎవరికి తెలీదు ఈ బడాయి - మళ్ళా అతగాడి వ్యాపారం దెబ్బతింటే ' అని వ్యాఖ్యానాలు చెయ్యరన్న గ్యారంటీ ఏమిటి ?'

బయటకు మాత్రం ఏమీ అనేదు భార్గవ -'సవ్యంగా నడుస్తున్న యింట్లో, రణరంగం సృష్టించుకోవడం ఎందుకూ ?' అని !

# హైదరాబాద్ నోట్‌బుక్

**తిరుమల రామచంద్ర**

## లలితకళా అకాడెమీ కళాప్రదర్శనం

ఆంధ్రప్రదేశ్ లలిత కళా అకాడెమీ జనవరి 12వ తేదీనుండి నిర్వహించిన 20వ వార్షిక కళా ప్రదర్శనం ప్రాచీన నవీన కళాభిమానులందరినీ ఆకట్టుకొంది. బంగారు పతకం, తక్కిన బహుమతులూ పొందిన చిత్రశిల్పాలు ఆ సన్మానానికి అర్హమైనవని కళాభిరుచిగల ఎవరైనా అంగీకరిస్తారు. ఈ ప్రదర్శనంలో 69 శిల్పచిత్రాలు ఉన్నాయి. మూడు సంవత్సరాలుగా ప్రత్యేకాహ్వానితుని రచనలు ప్రదర్శించాలని పెట్టుకొన్న సంప్రదాయం ప్రకారం ఈసారి ప్రముఖ చిత్రకారుడు శ్రీ కె రాజయ్య చిత్రాలు 15 ఈ ప్రదర్శనంలో పెట్టారు. ఉత్తమోత్తమమయిన రచనకు బంగారు పతకమూ, 15 వందల రూపాయలు, ఉత్తమమని ఎంపికయిన వాటికి చెరి 15 వందల రూపాయలూ బహుమతి ఇచ్చారు. ఈసారి ఉత్తమోత్తమంగా శ్రీ నరేంద్రరాయ్ చిత్రం 'ప్రజాస్వామ్యం ఎక్కడ?' ఎంపికైంది. ఈ చిత్రంలో ఇద్దరు మహిళలు ఒక ఎన్నికల పటాన్ని చూచి సంభాషిస్తారు. ఒక మహిళ పటాన్ని చూచి అడుగుతుంది—"అక్కా, అవి ఏమిటి?" అని. దానికి రెండవ మహిళ "వాళ్లు మన వోట్ల కోసం ఏగబడుతున్న జీవాలు" అని సమాధానమిస్తుంది. ఆ పటంలో ఉండేవి పాములు, పులులు, తోడేళ్లు, గుడ్లగూబలు, రాబందులూను. నేటి రాజకీయ స్థితికి ఇది వ్యంగ్యరూప కల్పన. దీనికి బంగారు పతకం ఇవ్వడం ఎంతైనా ఉచితం.

శ్రీ నరేంద్రరాయ్ కేశవ మెమోరియల్ స్కూలులో కళాధ్యాపకుడు. ఇదివరకే పెక్కు పర్యాయాలు బంగారు పతకాలు, బహుమతులు పొందినవాడు. తక్కిన బహుమానాలు పొందినవారు ఏడుగురు. వీరు— 1 శ్రీ బాల్‌రాజ్— ఇంకా వోటు హక్కు రాని యువకుడు. స్వయంగా కళ నేర్చినవాడు, చాలామందికి ఏకలవ్య శిష్యుడు. పలు ప్రదర్శనలలో పాల్గొన్నారు. 2 శ్రీ అడవరం లక్ష్మీనరసింహాచారి, శిల్పవంశం, కాకతీయ వైద్యశాస్త్ర పట్టభద్రుడు. ప్రస్తుతం వరంగల్ కాకతీయ వైద్యకళాశాలలో అధ్యాపకుడు. 3 శ్రీ ఎం ఈశ్వరయ్య, ప్రముఖ కళాకారుడు. ఇదివరకు అకాడెమీ అవార్డులు, బంగారు పతకం పొందినవాడు. 4 శ్రీ ఎస్ జనార్దన, 1978 తుఫాను బీభత్సాన్ని చిత్రించిన ప్రముఖ కళాకారుడు. ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభ [కౌలాలంపూర్]లో పాల్గొన్నారు. 5 శ్రీమతి ప్రతిభాదేవరాజ్, కెన్యాలోని నైరోబీనగరంలో జన్మించి బరోడా విశ్వవిద్యాలయంలో లలితకళా పట్టభద్రురాలై బహుమతులు పొందినవారు. 6 టి వైకుంఠం ప్రముఖ చిత్రకారులు. 7 శ్రీయాసీన్ మహమ్మద్, హైదరాబాద్‌లో ప్రథమిక విద్య ఎడప న్యూయార్క్ లలిత కళాధ్యయనం చేసి, లలితకళా అకాడెమీ బంగారు పతకం, హైదరాబాద్ ఆర్ట్ సొసైటీ బంగారు పతకం, మరికొన్ని బహుమతులు పొందాడు. ప్రస్తుతం ఢిల్లీలోని జామియా మిలియా ఇస్లామియాలో కళాధ్యాపకుడు. జనవరి 12వ తేదీన ఈ ప్రదర్శనాన్ని రాష్ట్ర విద్యాశాఖ కార్యదర్శి శ్రీ ఎం గోపాలకృష్ణన్ ప్రారంభిస్తూ, కళోజ్జీవనానికి ప్రభుత్వం 50 లక్షల రూపాయలు కేటాయించిందని, దీనివల్ల లలితకళా అకాడెమీ శాశ్వతమైన గ్యాలరీ నెలకొల్పవచ్చని అన్నారు. వోట్లను గురించి ఈ ప్రదర్శనంలో ఉన్న చిత్రం కళాకారుల భావస్వాతంత్ర్యానికి మచ్చుతునక అని, అకాడెమీ కళాకారుని వ్యక్తిత్వాన్ని ప్రోత్సహించాలని ఆయన అన్నారు. కళ శిలాయుగంనుంచి నేటి యాంత్రిక యుగందాకా అభివృద్ధి చెందిందని, ఆ కళాకారులు బహుమతులు కోరక, పేరుకూడ చెప్పక చిత్రించారని అన్నారు. తాము ఏ కళాకారుడని బహుమతులు పొందారని అన్నారు. ప్రారంభంలో అకాడెమీ కార్యదర్శి శ్రీ పి టి రెడ్డి స్వాగతం చెబుతూ




"ప్రజాస్వామ్యం ఎక్కడ?"

బంగారుపతకం పొందిన చిత్రం —చిత్రరచన శ్రీ నరేంద్రరాయ్

## హైదరాబాదు నోట్ బుక్

తగినంత డబ్బు లేనందున పెద్ద కార్యక్రమాలు మానుకున్నామని అన్నారు. ఎకడమిక్ స్టడీస్ను ప్రోత్సహించాలా? హాలిడే ఆర్టిస్టులను ప్రోత్సహించాలా? సండే ఆర్టిస్టులను ప్రోత్సహించాలా? జాతీయ విధానమేమిటి జాతీయ విధాన విజయం ముఖ్యమా, అంతర్జాతీయ అనుకరణ ముఖ్యమా? అనేది నిర్ణయించుకోవాలి'' అని ఆయన కళాకారులను కోరారు. ప్రత్యేకాహ్వానితులైన శ్రీ కె. రాజయ్య ప్రసంగిస్తూ, విద్యాలయాలలో చిత్రలేఖనంపై ప్రభుత్వానికి చిన్న చూపు ఉందని అన్నారు. మహారాష్ట్రలో చిత్రలేఖనానికి విడిగా డైరెక్టరేట్ ఉన్నదని, ఆంధ్రప్రదేశ్లోనూ అలాటిది ఉండాలని శ్రీ రాజయ్య సూచించారు. రాష్ట్రంలో గుంటూరు మహిళా కళాశాలలో తప్ప మరెక్కడా చిత్రకళ ఐచ్ఛిక విషయంగా లేదని ఆయన అన్నారు. యువతరం ముందుకు వచ్చి లలితకళలను ముందుకు తేవాలని ఆయన కోరారు.

### శ్రీ కాళేశ్వరరావుకు జోహార్లు

ప్రముఖ స్వాతంత్ర్య సమరసేనాని, పార్లమెంటరీ వ్యవహార విద్వాంసుడు, సంఘసేవకుడు దీనజనబాంధవుడు అయిన శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు శత జయంతి ఉత్సవాలు జనవరి 23, 24 తేదీలలో త్యాగరాజ గానసభలో విజ్ఞానదీపిక ఆధ్వర్యాన జరిగాయి. తొలినాటి సభకు అధ్యక్షత వహించిన విధానపరిషత్తు అధ్యక్షులు శ్రీ సైయద్ ఎ కప్బిర్ షా, కాళేశ్వర్ రావు చిత్రపటం ఆవిష్కరిస్తూ ఉత్సవాలు ప్రారంభించిన ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య, ఉత్తరప్రదేశ్ మాజీ గవర్నరు మీర్ అక్బరలీఖాన్ మున్నుగువారు శ్రీ కాళేశ్వరరావు బహుముఖ్య సేవను కొనియాడారు.

**సుఖం**

సుఖపడాలనుకునే వారెవరూ
ఇతరులను సుఖపెట్టలేరు!
పరులను సుఖపెట్టాలనుకునే
వారెవరైనా సరే
సుఖపడలేరు!!

—కొల్లు రంగారావు

ఆహ్వాన సంఘాధ్యక్షుడు, సాంకేతిక శాఖామాత్యులు శ్రీ హయగ్రీవాచారి స్వాగతం చెబుతూ, శ్రీ కాళేశ్వరరావుకు తగిన స్మారకం నగరంలో నెలకొల్పాలని కోరారు. రెండవనాటి ఉదయం సభకు శ్రీ హయగ్రీవాచారి, సాయంకాల సభకు మంత్రి శ్రీ కె. రోశయ్య అధ్యక్షత వహించారు. డాక్టర్ శ్రీ కె. వి. రావు ప్రత్యేక సంచిక ఆవిష్కరించారు. పలువురు ప్రముఖ సేవాధ్యక్షులు, విద్యావేత్తలు ప్రసంగించారు.

**ఉపశ్రుతి:**

చూచారా? ప్రొఫెసర్ నూరల్ హసన్ ఎలాటి సలహా ఇచ్చారో, ప్రతివారూ ప్రశ్నించుకొని సహేతుకమైన సమాధానాలు చెప్పగలిగేటట్టు మనస్సును పెంచుకోవాలన్నారు, విన్నారా?— అని అడిగారు సన్నోక పెద్దమనిషి. ప్రకోపవిపత్తు మనకు నేడు ఏండ్లనుంచే ఉంది. ప్రతిదానికీ ఒకం ప్రశ్నిస్తే కొండ నాయాలు ఇటుకలో పడతారని ప్రొఫెసర్ నూరుల్ హసన్కు తెలీదు పాపం — అన్నారు శ్రోతలలో ఒకరు.



# మీరు ఉద్యోగం వదిలేసినా ప్రతినెలా మొదటి తారీఖు నికరమైన రాబడి పొందవచ్చు

నేనొక ఉద్యోగిని నా జీతం నా కష్టార్జితం అని నాకు తెలుసు అది తెచ్చే స్వాతంత్ర్యభావం నాకెంతో ప్రియమైనది. కానీ ఏరోజైనా నేను ఉద్యోగం వదలవలసిరావచ్చు అప్పుడు ఏం చెయ్యాలి?

మీరు ఇప్పటినించే సిండికేట్ బ్యాంకులో అదా చేయటం మొదలుపెడితే ఉద్యోగం వదిలాక కూడా నెలజీతం పొందవచ్చు

ఈ రోజునుంచి 84 నెలలు అమర్ డిపాజిట్‌లో నెలకు 200/ అదాచెయ్యండి 84 నెలల తరువాత మీ అదా మొత్తం 24 314/ దానిమీద సిండికేట్ బ్యాంకు మీకు జీవితాంతం ప్రతినెలా 200/- ఇస్తుంది

ఒకవేళ మీరు 120 నెలలు అదాచేస్తే మీ మొత్తం 41 114/ అవుతుంది మీరు జీవితాంతం ప్రతినెలా 339/- పొందగలరు.

ఇది మీకు చాలా అనుకూలమైన పథకం కేవలం ఉద్యోగులకేకాక పింఛనుకి అదనగానూ పిల్లల చదువులకూ భవిష్యత్తుకి ఆలంబనగానూ ఉంటుంది.

మీ దగ్గరలో ఉన్న మీ జీవిత సహచరి సిండికేట్ బ్యాంకుని సంప్రదించండి.








**డి వి ఆర్ — అనకాపల్లి**

మన భారత దేశం అభివృద్ధి చెందక పోడానికి కారణం ఏమిటో చెప్తారా ?

ఏముందీ — ఎవరి గొడవ వారిదే గాని దేశం గొడవ ఎవరిదీకాక పోవడమే పెద్ద కారణం చూడండి ఇందరు మంత్రుల ఇన్ని మంత్రి వర్గాలు వచ్చి పోయాయి మీ అనకాపల్లి బాగు పడిందా? రాజమండ్రి బాగుపడిందా?!

**డి ఎల్ డి — కొత్తపల్లి**

ఆడవారికోపంలో అందము న్నదితే అన్నారే — నాకెప్పుడూ కనిపించలేదేమండీ ?

కొందరికి కళ్ళుండీ — చూపుండదు ప్రపంచాన్ని గాజుకళ్ళతో చూసినట్లు గుడ్డిగా చూస్తారు అందుకే కనిపించి వుండదు

**వి ఎస్ ఆర్ — తాళ్లపాలెం**

రచయితలు ఉన్నదున్నట్లు రాస్తారు రచయిత్రులు కల్పించిరాస్తారు అంటాను యామై కరెక్ట్ మేడమ్ ?

అబ్బా తెలుగులో చంపింది చాలదటయ్యా శ్రీరామమూర్తి ఇంగ్లీషు? రచయితలు పొటోగ్రాఫ్ తీసినట్లు 'రచయిత్రులు' ఘుమ్మగ్గలు పోటుపోటు రాస్తారా అనికదా? అంతే అలాగే చేస్తారు!

**బి జి కె — గూడూరు**

జీవితంలో అత్యంత విలువైనది ఏది ? జీవిత రథాన్ని నిలబెట్టేది ఏమిటి?

జీవితంలో అత్యంత విలువైనది డబ్బు, జీవిత రథాన్ని నిలబెట్టేది — డబ్బే

**ఎమ్ ఎమ్ ఎమ్ — బాబినా (యు పి)**

రచనలు పూర్తిగా తెలుగు 'లిపి'లో ఉండాలంటారే అలా అయితే పత్రికా సంస్థలకు నష్టం కలుగుతుందా ఇతర భాషా పదాలు రాసే రచయితులకంత శ్రద్ధ ఉంటే పూర్తిగా భాషా రచనం చేసేవారుగదా ?

మీరు పొరబడుతున్నారు 'తెలుగు లిపి'లో ఇంగ్లీషు మాటలు రాస్తే యిబ్బంది లేదు ఈ షరతు ప్రింటింగు సౌకర్యం కోసం మాత్రమే పెడుతూ ఉంటారు

**ఎమ్ వి — సికింద్రాబాదు**

కుర్రవాళ్ళు—ముసలివాళ్ళు ఎవరు నయం ?

కుర్రాళ్లే నయం నీతి నిజాయితీలే కాదు, మంచి మనసులు కూడా వీళ్లకి వుంటాయి

**చంద్రిక, సువర్ణ — ఉండి**

మీరు, ఆరుద్రగారు కూడా తెలుగు మహాసభలకి కౌలాలంపూర్ వెళ్లివుంటే బాగుండేది

నయం! వెళ్లలేదు! పరువు దక్కింది! లేకపోతే పేపుమెంటు ప్రతినిధుల పోటోల్లో మేమూ పడే వాళ్లం!

**ఎస్ బిన్ — నరసరావుపేట**

జీవితంలో మనిషి మరువలేనిది శాశ్వతమైనది ఏది ?

ఏంలేదు— ఒక్క మానవత్వంతప్ప

**కె వి — అనంతపురం**

కుల వ్యవస్థ మారకూడదంటాను మీరేమంటారు ?

మీలాంటి వారి సంఖ్య ఎక్కువ అందుకే కులాల పేర్లు చెప్పితేగాని పబ్బం గడవడం లేదంటాను నేనసలు పేరు మార్చుకుని—'రామలక్ష్మి బ్రాహ్మణి' అని పెట్టుకొందామా అనుకొన్నాను కాని— అదో వెనుకబడిన జాతి అయిపోయింది 'బ్రాహ్మణికం వంట కలిసింది లాభం లేదు శాఖ రాసుకో' అన్నాడు మా పెద్దమామయ్య అందుకిప్పుడు — రామలక్ష్మి వేగినాటి అనిపెట్టుకొంటే ఎలా ఉంటుందీ అనుకుంటుంటే— 'లాభం లేదు కులం మార్పు శాఖమార్పు అయితే ఏం ప్రయోజనం ? కులం మార్చు అంటూంది, మారమ్మ నాచిన్ననాటినేస్తం అంచేత జాతకం, న్యూమరాలజీ, నామ శాస్త్రం అంతా చూసి ఏ పేరు చేరుద్దామా అని చూస్తున్నాను. కులానిదేముందండీ— బ్రతుకు గడవాలిగాని!

**ఎస్ బిన్ — నరసారావుపేట**

మనిషి చుట్టూ సమాజం ఉందా? సమాజం చుట్టూ మనిషి ఉన్నాడా?

రెండూ విష చక్రాలే — ఒకదాన్ని చుట్టి ఇంకొకటి పరిభ్రమిస్తూనే ఉంటాయి

**జె, జి ఆర్ — చినవాల్తేరు**

మీ శీర్షికలో ప్రశ్నలు అడిగితే వారి పేర్లు పొడి అక్షరాలలో వేస్తారెందుకు?

మరీ చిన్న ఊళ్లలో పేర్లు యిట్టే తెలిసిపోతాయి అనవసరంగా అమాయకంగా ఉత్తరం రాసినవాళ్ళు రభసపాలు అయ్యే అవకాశాలు — కల్పించిన దాన్ని అవుతాను — అందుకే పొడి ఈ అక్షరాలు

**బిన్. ఎస్ — బాపట్ల**

మీ సమాధానాలతో నాకు ఎంత బాగుంటాయంటే— నేను బయటపెట్టలేని నామనస్సులోని భావాలు చక్కగా అక్కడ పొందుపరుస్తున్నారా అన్నట్టుంటాయి— మన దేశంలో స్త్రీజాతి అట్టడుగున అణగారిపోయే ఉంది కదా మరి స్త్రీలను కూడా రిజర్వేషను జాబితాలో చేర్చకూడదా ?

నీ ఆలోచన బాగుంది చిట్టి తల్లీ, కాని ఆడదానికి ఆడదానిపై ఎంత కరుణ ఉంటుందో మొన్న —ఎమర్జెన్సీ విషయంలో మన ప్రధాని— బయటపెట్టారు కదా అయినా — మహిళా సంఘాలవారూ మహిళోద్యమ కర్తలూ — ఆడదాని సముద్ధరణకి — కంకణం, కట్టుకుంటారే గాని, ఇన్నీకూడా ఏ కొద్దిమంది పెద్దల చేతుల్లోనో— ఘనత కోసం ఉడిపోతున్నాయే తప్ప సామాన్య స్త్రీ చుట్టుపక్కలకి రావడంలేదు మీరు సూచించినట్లు — స్త్రీని కూడా వెనుకబడిన జాతిగా గుర్తించేందుకు పాటుపడితే— లాభమేనా ఉంటుంది చూద్దాం మన 'మహిళా' ప్రతినిధులు దీన్ని గురించి ఆలోచిస్తారేమో

**కబీరు — అనంతపురం**

నీ యొక్క అహంకారం పొగరుబోతుతనం, నిర్లక్ష్యం చూసి సహించలేక ఆరుద్రగారు మీకు విడాకులిచ్చినట్లు తెల్లవారు జామున కల వచ్చింది తెల్లవారు జామున కలలు నిజమవుతాయంటారు

అప్పుడే నాకూ వచిందో కల 'వెళ్ళండీ, వెళ్ళి దేశం నలుమూలలా మీరు పంచిన ప్రేమలేఖల మూటలు తెచ్చుకోండి — ఎందుకేనా మంచిది' అని మావారిని మూటా ముల్లే కట్టి ప్రయాణం చేయిస్తున్నాను అబ్బే నసేమిరా కదలనంటున్నారు మా వారు!— ఆ గడ్డంలో నవ్వుకుంటున్నారో తెలియదు, మూతి ముడుచుకొన్నారో—తెలియదు ఖర్మ ?

**ఎస్ హెచ్ — సునబేడ**

రెచ్చగొట్టేటంత శృంగారంగా సింగారించుకున్న ఆడదాన్ని చూస్తే ఎంత మగాడికైనా మనసు చలించక మానదు కాదంటారా ?

ఆ స్త్రీ మీ చెల్లెలో, తల్లో, వదినో అయితే కూడానా? నగ్నంగా పోతున్నా— పరాయి మగవాడిని పట్టించుకోని ఆడవారిని చూసైనా మీరు తెలుసుకోరెందుకు?




## సోంపాపిడి

కావలసిన వస్తువులు 1 కిలో మైదా పిండి, 2 కేజీలు పంచదార, 600 గ్రాలు డాల్డా

చేసే విధానం దళసరి ఇనుప మూకుడు పెద్దది తీసుకొని, అందులో 600 గ్రాలు డాల్డా వేసి పొయ్యి మీద పెట్టి మంట పెట్టాలి డాల్డా బాగా మరిగాక కెజీ మైదా పిండి వేసి అట్లకాడతో కదుపుతూ ఉండాలి డాల్డా అంతా ఇరిగి మైదాపిండి ఎర్రగా ముద్దగా అయ్యేంత వరకూ అడుగంటకుండా కదుపుతూ ఉంచి ముద్దగా అయ్యాక మూకుడు క్రిందకు దింపి, మైదా ముద్దను ఒక గిన్నెలోకి తీసి ఉంచుకోవాలి

అదేమూకుడు శుభ్రంగా తుడిచి, 2కేజీల పంచదార అందులో వేసి, కొంచెం నీరు పోసి పొయ్యి మీద పెట్టి మంట బాగా పెట్టాలి పంచదార కరిగి తీగపాకం వచ్చేదాకా కదుపుతూ ఉండాలి పాకం రావటానికి సుమారు అరగంట పట్టవచ్చు పాకం చేతికి అంటుకోకుండా తీగలా వచ్చే సమయం చూసుకొని క్రింద గచ్చుకి (లేదా పెద్ద పళ్ళానికి) కొంచెం నెయ్యి రాసి, ఈ పాకాన్ని పోసెయ్యాలి రెండు నిముషాలు కొంచెం చల్లారాక గచ్చు మీద పోసిన పాకాన్ని నలుచదరంగా చేసి, దానిని రెండుగా చీల్చి, మైదాపిండి ముద్దను ఆ మధ్యలోపోసి, మైదాపిండితో కలిపి ఆవేడి పాకాన్ని మెలితిప్పుతూ సాగదీయాలి చేతికి నెయ్యి రాసుకొని ఎంత తొందరగా వేడి వేడి పాకాన్ని సాగదీస్తే అంత తొందరగా అవుతుంది అలా పాకాన్ని సాగదీయగా, సాగదీయగా పావుగంటకి, మైదాపిండి, పంచదార పాకం కలిపిన మిశ్రమం పట్టుకుచ్చుల్లా జలాజలా రాలిపడతాయి చల్లారాక ఈ "సోంపాపిడి" ఒక టిఫిన్ కారియర్‌లోకి ఎత్తి మూత పెట్టి ఉంచుకుంటే చాల రోజులు నిలవ ఉంటుంది. చంటిపిల్లలు తిన్నా జబ్బు చేయదు.

— ఏ స్వర్ణలత

## కళాసాగర్ 9వ వార్షిక సంచిక

మదరాసులోని ప్రముఖ తెలుగు సాంస్కృతిక సంస్థ 'కళాసాగర్' అక్కడి తెలుగు వారి కోసం భారీ ఎత్తున ఎన్నో సాంస్కృతిక, వైజ్ఞానిక కార్యక్రమాలని నిర్వహిస్తూ సర్వతోముఖంగా ప్రగతిని సాధిస్తున్నదనటానికి ఈ తొమ్మిదవ వార్షిక ఉత్సవ ప్రత్యేక సంచిక నిదర్శనంగా ఉంది. శ్రీ ఎం. ఎ. సుభాన్, శ్రీ ఎ. బి. సాయి ప్రసాద్‌ల సంపాదకత్వంలో రూపు దిద్దుకున్న ఈ సంచికలో సంస్థ నిర్వహించిన కార్యక్రమాల వివరాలు, ఛాయాచిత్రాలే కాక ప్రముఖ రచయిత(త్రు)ల రచనలెన్నిటినో ప్రచురించారు. వివరాలకి కళాసాగర్ 25, మూలోని రోడ్డు, టి. నగర్, మదరాసు 600017 కి రాయాలి.

## అవీ ఇవీ అన్నీ

### ఆధునిక సాహిత్యంలో రైటర్స్ వర్క్‌షాపు

'సంస్కృతి సమాఖ్య' (యువ సాహితీ వికాస వేదిక) ఆంధ్రప్రదేశ్ తన కృష్ణా సమాఖ్య విభాగం ఆధ్వర్యాన మార్చి రెండవ వారం నుండి 'రైటర్స్ వర్క్‌షాపు' నిర్వహిస్తుంది. ఆయా రంగాల నుండి ప్రసిద్ధ సాహితీవేత్తలు ఆ అధ్యాపకులుగా నియమించబడుతున్నారు. ప్రిన్సిపల్, కరెస్పాండెంటు, డైరెక్టర్లను సమాఖ్య రాష్ట్ర కమిటీ నియమించింది. రైటర్స్ వర్క్‌షాపులో ప్రవేశము కోరే ఔత్సాహిక రచయిత, రచయిత్రులు వారి వివరాలతో స్వంత చిరునామా గల కవరు పంపి ప్రవేశ పత్రము, ఇతర వివరములు సమాఖ్య జిల్లా ప్రధాన కార్యదర్శి కుమారి కె. పుష్పలత, 23-23-60 ఎ 1 శివరావు వీధి, సత్యనారాయణపురం, విజయవాడ-520011 నుండి పొందవచ్చునని రాష్ట్ర కమిటీ ప్రధాన కార్యదర్శి రాస్తున్నారు.

### ఇండోర్ తెలుగు విజ్ఞానసమితి

సంక్రాంతి సందర్భముగా తెలుగు విజ్ఞాన సమితి, ఇండోర్‌వారు సాంస్కృతిక కార్యక్రమము శ్రీ వై. ఎస్. ఆర్. శాస్త్రిగారి ఆధ్వర్యమున ఏర్పాటు చేశారు. శ్రీమతి శశిరావు అధ్యక్షులుగా, శ్రీమతి ధనలక్ష్మిచెట్టి ముఖ్యఅతిథిగా విచ్చేసినారు. సమితి అధ్యక్షులు డా. కె. ఎస్. మూర్తి గారు పరిచయ వాక్యాలు పలికారు. కార్యక్రమము చిరంజీవులు కె. జయ, వి. జయల ప్రార్థన, కాంతి ప్రవీణ, కె. జయ, వి. జయ, కుమారి భారతి, కుమారి జ్యోతి, పద్మిని, అనూజ, మరియు శ్రీ పలీష్‌చెట్టిలు వివిధ రకములైన నృత్యములు ప్రదర్శించారు. శ్రీ జంధ్యాల విరచితమైన "డాక్టరు సదాశివం" అను నాటిక ప్రదర్శించారు. శ్రీమతి ధనలక్ష్మిచెట్టి ఆటల పోటీలలో గెల్చిన వారికి బహుమతి ప్రదానము చేశారు. శ్రీమతి శ్రీ డి. బి. కీర్తివార్‌గార్లు తాము స్వంతంగా కొన్ని బహుమతులను ముఖ్య అతిథి ద్వారా సాంస్కృతిక కార్యక్రమములో పాల్గొన్న కళాకారులకు అందచేశారు. శ్రీమతి పి. లక్ష్మీనరాజా కార్యక్రమాన్ని మనోరంజకముగా నిర్వహించారు.






Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar Vijayawada-3 Editor S Radhakrishna